

# సాహిత్య మాస పత్రిక

వెల: రూ॥ 4-00

మే-1994



దక్షిణ భారత
హిందీ ప్రచార సభ-
ఆంధ్ర, హైదరాబాదు.

ఫోన్ ;36866

టెలిగ్రామ్: హిందీసంఘ్

482

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

మే – 1994

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ
శ్రీ ఈమని దయానంద
శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర
ఖైరతాబాద్, హైదరాబాద్–500 004

సంవత్సర చందా
40–00 రూ॥

విడిప్రతి
4–00

**Recommended for use in all the Public libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras, Vide proceedings Dis No. 30/55 dated 6th January-1955.**

# ఈ సంచికలో

# అమృతోత్సవము

దక్షిణ దేశంలో హిందీ ప్రచారోద్యమం ప్రారంభమై 75 సంవత్సరాలు పూర్తిగానున్నవి. ఆ ఉద్యమ నిర్వహణకై మహాత్మాజీ దక్షిణ భారత హిందీ ప్రచార సభను మద్రాసులో స్థాపించారు. ఆ సభ రజత జయంతిని, స్వర్ణ జయంతిని, వజ్రోత్సవాన్ని జరుపుకొని ఈ సంవత్సరం అమృతోత్సవాన్ని జరుపుకొంటున్నది. ఇది ముదావహమైన విషయం. హిందీ ప్రచారసభ జాతీయ ప్రతిపత్తి గలిగిన సంస్థ. విశ్వవిద్యాలయ స్థాయికి ఎదిగిన సంస్థ. సామాన్య జనానీకానికి హిందీని నేర్పడంతో బాటు హిందీలో ఉన్నత విద్యాబోధనకు గూడా కృషి చేస్తున్న సంస్థ. సభ నడిపించే హిందీ పరీక్షల్లో దక్షిణ దేశంలో వేలకొలది విద్యార్థులు హాజరవుతున్నారు. అంతేగాక సభ స్నాతకోత్తర కేంద్రాలు హైదరాబాదు, మద్రాసు ఎర్ణాకులం ధార్వాడ్ పట్టణాలలో స్థాపించబడ్డవి. ఆ కేంద్రాలలో హిందీలో ఎమ్. ఏ. ఎమ్. ఫిల్., పిహెచ్ డి డి.లిట్. పరీక్షలకు తరగతులు నడుస్తున్నవి. హిందీ మాధ్యమంలో దక్షిణదేశంలో సభ యాజమాన్యాన 14 బిఎడ్. కాలేజీలు నడుస్తున్నవి వివిధ పట్టణాలలో అనువాద డిప్లొమా పరీక్షలు నడుస్తున్నవి సభ అసోసియేషన్ ఆఫ్ ఇండియన్ యూనివర్శిటీకి అనుబంధ సంస్థ. కామన్వెల్త్ యూనివర్శిటీల సంఘంలో గూడా సభ్యత్వం గలిగివున్నది. విశ్వవిద్యాలయ స్థాయిలో ఇంకా అనేక పాఠ్యక్రమాలను నడపబోతున్నది. ఇది ప్రజాహిత సంస్థ. దక్షిణ దేశంలో 75 సంవత్సరాలుగా అకుంఠిత దీక్షతో భాషా ప్రచారానికి కృషిచేస్తున్నది

మార్చినెల 21వతేదీన న్యూఢిల్లీలో తమ నివాస గృహంలో సభ అధ్యక్షులు, భారత ప్రధాన మంత్రి, బహుభాషాకోవిదులు గౌరవనీయులు శ్రీ నరసింహారావుగారు సభ అమృతోత్సవాన్ని ప్రారంభించారు. ఆ ఉత్సవానికి దక్షిణదేశం నుండి పలువురుహిందీ పండితులు, హిందీ ప్రచారకులు హాజరైనారు. ఢిల్లీలోని పలువురు హిందీ కవులూ, పండితులూ గూడా సమావేశంలో పాల్గొన్నారు. అమృతోత్సవం ఆ నాటితో ప్రారంభమయింది. ఇక నుండి దక్షిణ దేశంలోని వివిధ పట్టణాలలో, పల్లెలలో ఈ ఉత్సవ కార్యక్రమాలు జరగగలవు. శ్రీ నరసింహారావుగారు తమ ఉపన్యాసంలో చాలా ముఖ్యమైన విషయాలను సెలవిచ్చారు. హిందీ ఉద్యమానికి ఒక కొత్త కార్యక్రమాన్ని సూచించారు. ఇంతవరకు

హిందీ ప్రచారానికి సభ పని చేసింది. హిందీ రాని వాళ్లకు హిందీ నేర్పించింది. అనేక కష్టనష్టాలను ఎదుర్కొన్నది. ఘెరావ్‌లను సహించింది. అయినా దీక్షతో తన పనిని తాను సాగించింది. ఇప్పుడు పరిస్థితి మారింది. ఇదివరలోగా హిందీ నేర్చుకోమని ప్రబోధంచేయవలసిన అవసరం ఇప్పుడులేదు. హిందీ ఎందుకు నేర్చుకోవాలో ఇప్పుడందరికీ తెలుసును. తండ్రి హిందీకి వ్యతిరేకంగా మాట్లాడుతూనే తన కుమారుణ్ణి హిందీ తరగతికి పంపిస్తున్నాడు. భారత జాతీయ సమైక్యతకు హిందీ అవసరమని అందరూ గుర్తించారు అన్నారు. ఇక ముందు జరగవలసిన పని ఏమిటి? సభ కార్యక్రమం ఏ విధంగా రూపు దిద్దుకోవాలి? అనేదానికి జవాబు చెప్పుతూ శ్రీ నరసింహారావుగారు ఇలా అన్నారు. 'హిందీ భాష సమైక్యతకు చిహ్నామన్నాము. అందువలన అది దక్షిణ దేశపు జన జీవితంతో పెనవేసుకొనిపోవాలి. దక్షిణదేశ సాహిత్య సంపదను తనలో ప్రతిబింబింప చేసుకోవాలి. దక్షిణదేశ భాషల్లో అమూల్యమైన సాహిత్య సంపద వున్నది. ప్రాచీన సాహిత్యంలోనూ ఆధునిక సాహిత్యంలోనూ ఆ భాషలు ఎంతో అభివృద్ధిచెంది వున్నవి ఆ సంపదంతా హిందీలోకి రావాలి. ఆ సంపదంతాజాతీయ సాహిత్య స్రవంతిలో చేరిపోవాలి. వివిధ సాహిత్యేతర రంగాలలో గూడా ఆ భాషలలో జరుగుతున్న వికాసమంతా హిందీ వికాసానికి తోడ్పడాలి అన్నారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆ పని చేయగలదు. దానికి ఆ శక్తి వున్నది. నా అభిప్రాయంలో హిందీ ప్రచార సభ పేరు నుండి ప్రచార శబ్దాన్ని తొలగించి హిందీ సభ—హిందీ సాహిత్య సభ అని నామకరణం జరగాలి అన్నారు. హిందీ వ్యాప్తి కేవలం భాషా వ్యాప్తి మాత్రమేగాదు. అది సమైక్యతకు చిహ్నం అన్నారు. అదే సందర్భంలో కంప్యూటర్ల ప్రాముఖ్యాన్ని వివరిస్తూ సభ భారతీయ భాషా మాధ్యమంలో కంప్యూటరు వినియోగాన్ని ప్రారంభించింది- హైదరాబాదు, మద్రాసు కేంద్రాలలో ఆ పని ప్రారంభించబడింది. మన పూర్వులు కంప్యూటర్ లేని రోజుల్లోనే అమరకోశం, అష్టాధ్యాయి వంటి అమృతమైన గ్రంథాలను ప్రచురించి అద్భుతమైన కృషిచేసి వున్నారు. ఇప్పుడు కంప్యూటర్ యంత్రం గూడా లభించింది. గనుక కంప్యూటర్ ద్వారా భారతీయ భాషల వికాసానికి సభ కృషిచేయాలి అన్నారు. ఈ పని రాబోవు 25 సంవత్సరాలలో జరగవలెనని- అందుకు అమృతోత్సవంతో నాంది పలకవలెనని అన్నారు. శ్రీ నరసింహారావుగారి సూచనలను వారి అధ్యక్షతన జరిగిన సభ కార్యవర్గ సమావేశం అంగీకరించింది. సభ అమృతోత్సవం ద్వారా అధికోత్సాహంతో ముందుకు సాగగలదని ఆశిస్తున్నాము. ఈ సందర్భంలో సభాధ్యక్షులు శ్రీ నరసింహారావుగారికి హృదయ పూర్వకమైన ధన్యవాదాలు తెలియజేస్తున్నాము. దక్షిణదేశంలో జరగనున్న అమృతోత్సవ కార్యక్రమాలు నూతనరూపాన్ని సంతరించుకొనగలవని విశ్వసిస్తున్నాము.

# సాహిత్యవీధి

## సమకాలీన కథానిక– వస్తు, రూప పరిణామం

కె.పి. అశోక్‌కుమార్

ప్రతిసంవత్సరం అన్ని దిన, వార, మాస, సంవత్సరాది పత్రికల్లో కలిసి కొన్ని వేల కథలు వస్తున్నాయి. ఇవన్నీ ఎవరు చదువుతున్నారు అన్నది ప్రశ్న. ఒకవేళ చదివితే, మంచికథలు ఎన్ని ఉంటాయంటే వేళ్ళ మీద లెక్కపెట్టవలసిందే. గతంలో పత్రికలు రీడబిలిటికి ప్రాధాన్యాన్నిస్తే ఇప్పుడు అమ్మకాల పెరుగుదలకు ప్రాముఖ్యాన్ని ఇస్తున్నారు. వ్యక్తులు మారలేదు. విలువలు మారినాయి. చౌకబారు అక్కర్షణలతో ఎక్కువ మంది కానగలిగే విధానాన్ని రూపొందించడమే సంపాదకుల పని. అదే యజమానుల ఉద్దేశం కూడా. దానికి తగ్గట్టుగానే రచనలను ప్రోత్సహించడం ప్రచురించడం జరుగుతుంది. వీరు రచయితలకు ఎక్కువ ప్రచారం కలిగిస్తారు. సమాచార సేకరణ ఎలా చేయాలో చెబుతారు. ఇదొక రకంగా కొత్త రచయితలను ప్రోత్సహిస్తున్నట్లు కన్పించినా దీని వెనుక ఆ కొత్త రచయితలు వైయక్తిక స్వేచ్ఛను కోల్పోయి వ్యాపార ధోరణి అలవరచుకుంటారు. సామాన్యంగా కొత్తగా కలం పట్టిన రచయితలు వీళ్ళ ప్రలోభాలకు అతి సులువుగా లొంగిపోవడం జరుగుతుంది. ఇలాంటి కొత్త–పాత్రల రచయితల కథల్ని పరిశీలిస్తే, ఇందులో ఎన్ని మంచి కథలు వచ్చినాయో, కథలలో వస్తువును– రూప పరిణామాన్ని గుర్తించడం మనకు ఎంత అసాధ్యమైన పనో అవగతమవుతుంది.

మొత్తంగా కథలను వస్తుపరంగా చూస్తే డెబ్బయి శాతం. కథలు ప్రేమ-శృంగారానికి. ముప్ఫయిశాతం కథలు కుటుంబ వ్యవస్థకు మరియూ మానవ సంబంధాలకు చెందినవి ఉన్నాయి. రూప వైవిధ్యం, వస్తువైవిధ్యం గల కథలు చాల తక్కువనే చెప్పాలి.

ముందుగా అధికశాతం గల కథలను వస్తుపరంగా చెప్పాలంటే శృంగార కథలుగా చెప్పుకోవాలి. ఇవన్నీ కొత్త సీసాలో పాత మందులాగే వుంటాయి.

హనుమాన్‌టేకిడీ, మచ్చ బొల్లారం, సికింద్రాబాదు-500 010.

## 1. శృంగార కథలు

ఒకప్పుడు ప్రేమ కథలు విరివిరిగా వచ్చాయి. బాయ్ మీట్ గరల్ కథలు, ట్రయాంగిల్ లవ్ స్టోరీలు మొదలైనవి. అప్పట్లో ప్రేమకు, శృంగారానికి బోలెడంత వ్యత్యాసముండేది. రానురాను వాటి మధ్య గీత చెరిగిపోయింది. గతంలో శృంగార పత్రికలు విడిగా వుండేవి. ఇప్పుడు ఆ లోటును వారపత్రికలు పూరిస్తున్నాయి. ఇంకా ప్రత్యేకంగా సెంటర్‌స్ప్రెడ్ కథలు. సరసశృంగార కథలు పేరిటవచ్చేవి అన్నీ బూతు కథలే. ఒక పత్రిక వారు ఏకంగా సరస శృంగార కథలకు పోటీ పెట్టారు వస్తుపరంగా పర్వర్టెడ్ సెక్స్‌ను పూర్తిగా దించేశారు. వోయరిజం—ఫెటిషిజం—శాడిజం—హోమోసెక్స్—గ్రూప్‌సెక్స్—గ్యాంగ్ రేప్ శృంగార కథల్లో అక్రమ సంబంధాలను, అవినీతి చర్యలను హైలెట్ చేసే ప్రయత్నం చాలా వాటిలో కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది. సున్నితమైన భావనలకు, మానసిక స్పందనలకు ఈ కథల్లో చోటులేదు. ఈ కథలు వ్రాసేదెవరు? చాలా మంది కొత్తవాళ్ళు కనిపిస్తారు. జోక్స్ వ్రాసే వాళ్ళు, చిత్తరాల రచయితలు ఇలాంటి కథలలో పేరులోకి రావాలని ప్రాకులాడటం ఎక్కువయింది. విచిత్రమేమిటంటే ఇందులో ఆడవాళ్ళు కూడా ఉండటం. కొన్ని కథలను ఆడపేర్లతో వ్రాసినా, అవి ఓ మగాడు వ్రాసినవని ఈజీగా తెలిసిపోయేవి కూడా వున్నాయి. ఒక సంపాదకులు తమ పత్రిక ద్వారా కొత్త రచయితలను తయారు చేసిన ఘనత తమదే అన్నారు. ఇదిగో ఇలాంటి సరుకన్నమాట.

## 2. ఎ. కుటుంబ సంబంధాలు

ఇవి ఎక్కువగా తండ్రి కొడుకులు లేదా తల్లీ కొడుకుల మధ్య సంబంధాలు-తల్లి తండ్రుల ఆప్యాయతను మరచి పోవడం—వారిని నిరాకరించడం లేదా వదిలేయడం తర్వాత ముసలివాళ్ళు పడేపాట్లు కనిపిస్తాయి. ఇందులో కొడుకుల వివాహం వల్లనో లేదా ఉన్నత స్థాయికి చేరుకోవడం వల్లనో తల్లిదండ్రులను ఈసడించుకోవడం-దూరం చేసుకోవడం కనిపిస్తుంది. తల్లిదండ్రులు ఎదిగొచ్చిన కూతుళ్ళ వివాహం గురించి పట్టించుకోక కొడుకు భవిష్యత్తును తీర్చిదిద్దితే వాళ్ళు పట్టించుకోకపోగా, ఇక అమ్మాయిల వివాహం గురించి బాధపడటం కనబడుతుంది. తల్లిదండ్రులను విడదీసి తల్లి ఒక కుమారుడి దగ్గర, తండ్రి ఇంకొకడి దగ్గర ఉండటం—వాళ్ళను పనిమనుషులుగా ట్రీట్ చెయ్యడం-చివరికి మనవలను కూడా దగ్గరకు రానివ్వక పోవడం—ఒకవేళ మనవలతో అనుబంధం కుదిరినా, దానిని త్రుంచెయ్యడానికి ప్రయత్నించడం-చివరికి వారు ఏకాకులుగా మిగిలిపోవడం—వృద్ధాప్యంలో ఒంటరితనంతో పడే బాధలతోపాటు పిల్లల వివాహాలు మొత్తం కుటుంబంలో తెచ్చిన మార్పులు వివరించే కథలు ఎక్కువగా వస్తున్నాయి.

## బి. మానవ సంబంధాలు :

వీటిలో ఎక్కువగా స్నేహం గురించి ఎదిగిన మనస్తత్వాలు అవకాశవాద ధోరణులు—పరపతి పెరగగానే ఆత్మీయతలను మరచిపోవడం—చివరకు ఊరిని, పరిసరాలను కూడా మరచిపోవడం ఎక్కువగా కనిపిస్తుంది. మధ్యతరగతి వాళ్ళ నిస్సహాయతలు, వాళ్ళ సెంటిమెంట్స్‌ను ఇతరులు ఉపయోగించుకోవాలని చూడడం ప్రేమ పేరిట వంచనలు-పెళ్ళిలో జరిగే మోసాలు, అవకతవకలు ఇవన్నీ కూడ మామూలు ధోరణిలోనే ఉన్నాయి.

## 3. రాజకీయాలు

గ్రామ సర్పంచ్, అధ్యక్షుడు, యం. యల్. ఏ. మంత్రి వాళ్ళ వాళ్ళ పరిధిలో సాగించే రాజకీయాలు, ఉద్యోగుల వేధింపు-అక్రమ సంపాదన, ఇతరులను బలి పశువులుగా చేయడం—మొత్తం మీద ఉన్న వ్యవస్థను ఎలాగ దిగజారుస్తున్నారో విపులంగా వివరించే కథలు. దేశం కంటె-ప్రజల కంటె—పార్టీ కంటే వ్యక్తిగత ప్రయోజనాలకు ఎలా లొంగిపోయి, వాటిని తమ కనుగుణంగా మలుపుకుంటున్నారో వివరించే కథలతోపాటు వీరి అండ జూసుకుని విజృంభించే అనుచర గణం—ఉద్యోగుల జులుం—సామాన్యుడి వేదన మొదలైన కథలు ఈ కాలంలో విరివిగా రావడం విశేషం.

## 4. హాస్య. వ్యంగ్య కథలు :

హాస్యం పేరిట వచ్చిన కథలలో ఎక్కువభాగం అపహాస్య కథలే. చౌకబారు హాస్య, శృంగార ఘట్టనలు హాస్య కథలుగా చలామణీ అయినవి. హాస్యకథల పేరిట పోటీ నిర్వహించినా మంచి హాస్యకథలు రాకపోవడం విశేషం. ఈ హాస్య కథలు ఎక్కువగా స్కెచ్‌లలాగా తయారైనవి ఎన్నో ఉన్నాయి. హాస్యం పేరిట చౌకబారు బూతు కథలు కూడా వెలుగులోకి వచ్చాయి.

ఇతరులను అనుకరించడంలో పడే ఇబ్బందుల నాధారంగా చేసుకుని వ్యంగ్య ప్రధాన కథలు రాగా, సమకాలీన పరిస్థితుల మీద, రాజకీయ పార్టీలు ముఖ్యంగా తమకు నచ్చని పార్టీల మీద వ్యంగ్య కథలుకొన్ని వచ్చాయి.

## 5. విద్యా వ్యవస్థ

ఇందులో వచ్చిన కథలు అధిక భాగం స్కూల్ ఎడ్యుకేషన్‌కు సంబంధించినవే. దీనికి కారణం బహుశా రచయితలు ఎక్కువగా స్కూల్ టీచర్లు అయివుండవచ్చు. అయితే ఇందులో ఎక్కువ శాతం కథలు సెంటిమెంట్స్‌కు సంబంధించినవే. గురువుగారు రిటైరవడం వేదా ట్రాన్స్‌ఫర్ కావడం విద్యార్థులు ఆయన్ని వదలలేక పోవడం లేదా గురువుగారు ఆ శిష్యుల్ని, ఆ ఊరి వారు చూపిన ఆప్యాయతల్ని విడిచి వెళ్ళలేక పోవడం—లేదా ఎవరో ఒకరు పాత స్మృతులను గుర్తు చేసుకోవడం ఎక్కువగా కనిపిస్తాయి.

స్పెషల్ టీచర్ ఉద్యోగాలకు కూడా ఎగబడి డబ్బుపెట్టి కొనడం— స్పెషల్ టీచర్ మారుమూల ప్రాంతాల్లో ఇమిడి నడపలేక పోవడం—గ్రామ అధికార్ల పెత్తనం—వేధింపులు, పిల్లల మధ్యాహ్న భోజనం ఎవరి జేబులోకి పోతుందో తెలపడం—ప్రభుత్వం పథకాలలోని అవకతవకలు—వాటిని నాయకులు, అధికారులు ఎలా నీరు కారుస్తున్నారో తెలుపడం గురించి వచ్చినా, ట్రాన్స్‌ఫర్ల బాధలు ఉన్న కథలు కూడా ఎక్కువే.

సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశపెడితే ఎలాగుంటుందో రేపటి చదువులు ఎలాగుంటాయో ఊహించుకొని సరదాగా రాసిన హాస్యకథలున్నాయి బడి ఎగ్గొట్టి స్వంత పనులు చూసుకునే ఉపాధ్యాయుల గురించి, పిల్లల్ని పీడించే పంతుళ్ళ గురించి నాయకుల చుట్టూ తిరిగే అవకాశవాదుల గురించి, అధికారులను కాకాపట్టే భజనరాయుళ్ళ గురించి తెలిపే కథలు వచ్చాయి,

ఈవ్ టీజింగ్, అధ్యాపకుల నేడిపించడం, విద్యార్థి యూనియన్ పోటీలు-వాటి చెడు ఫలితాలు, కాపీల ప్రహసనం నేపథ్యంగా వచ్చిన కాలేజీ కథలు.

తిరునాళ్ళలా జరిగే సెమినార్ల గురించి, పరిశోధక విద్యార్థుల వెట్టిచాకిరి గురించి, ప్రొఫెసర్ల అలసత్వం—అజ్ఞానం గురించి, విశ్వవిద్యాలయాల్లో రాజకీయాల గురించి వివరించే కథలు వచ్చినాయి.

అయినా విద్యా వ్యవస్థలోని లొసుగులు, అవకతవకల గురించికాని బోధనా పద్ధతులు—సమస్యల గురించి కాని చర్చించినవి లేనేలేవు ఈ నేపథ్యంలో అభిమాన శిష్యులు తమ గురువుగారిని కూడా ఉద్యమంలోకి తీసుకువచ్చిన అద్భుత కథలో మేష్టారి అంతర్మథనాన్ని చిత్రించిన బి. ఎస్. రాములుగారి సహజాతులు కథ వస్తురీత్యా చాలా గొప్ప కథగా చెప్పుకోవాలి.

## 6. వ్యవసాయం—రైతులు

భూస్వామ్య సన్నకారు రైతుల భూముల నాక్రమించడం వారిపై దౌర్జన్యాలు, వారు కూలీలుగా మారడం పాతబడిపోయింది. చిన్న రైతులెదుర్కొనే సమస్యలు, వర్షాధార పంటల వలన ఎలా నాశనమవుతుంది పంటలకు నీరుకోసం పంతాలకుపోయి ఉన్న ఆస్తిని తగలేసుకోవడం—చివరికి హత్యలతో పరిష్కరించాలనుకోవడం, కరెంట్ సమస్య, నకిలీ మందులు—ఎరువుల మోసాలు, బ్యాంక్ ఋణాల ప్రహసనాలు, గిట్టుబాటు ధరలు లేక అయినకాడికి అమ్ముకొని, వాడి దగ్గరే విత్తనాలకు అప్పుతీసుకోవడాలు, మధ్య దళారీల దోపిడులు—ఇన్ని సమస్యలను ఎదుర్కొంటున్నా భూమపై వారికున్న ప్రేమ ఆ భూమిని వదలకుండా చేసి రుణ వలయంలో ఎలా సతమతమవుతున్నారో వివరించే కథలు ఎక్కువగా రావడం ఒక విశేషమైతే-వివిధ కోణాల నుండి సమస్యలను చిత్రించి పాఠకులను ఆలోచింప చేయడం మరొక విశేషం.

## 7. ఆరోగ్యం—పర్యావరణం

డాక్టర్— పేషంట్ల కథలు, డాక్టర్ల వ్యాపారత, పేదల నిస్సహాయత చిత్రించే కథలతో పాటు ఫైవ్‌స్టార్ ఆస్పత్రులు చేసే బహిరంగ దోపిడిని అవి ఏ విధంగా ప్రజాసేవ చేసేది వివరించే కథలు, ఆరోగ్యం విషయంలో ప్రభుత్వ శ్రద్ధాశక్తుల గురించి తెలియజేసే కథలు కూడా వున్నాయి.

నీటి విద్దడి—త్రాగు నీటికై ప్రజలు పడే పాట్లు రాజకీయవాదుల ఆవకాశవాదాలు, ప్రాంతీయ వైషమ్యాలు, ప్రభుత్వ ఉదాసీనతను వివరించే కథలు కూడా వచ్చాయి.

ప్రపంచ వ్యాప్తంగా పర్యావరణ సమస్యల నెదుర్కొవడంపై కృషికొనసాగుచుండగా, ఈ అంశంపై తెలుగులో వచ్చిన కథలను వేళ్ళ మీద లెక్కబెట్టవలసిందే. ఇరుగుపొరుగుల కయ్యాల వరకే పరిమితమైన ఇలాంటి కథలకు భిన్నంగా పరిసరాల పారిశుద్ధ్యాన్ని గురించి ఇటు ప్రజలు, అటు మునిసిపాలిటి పట్టించుకోకపోతే సామాన్య పౌరుడిగా మన బాధ్యతలు తెలియజేసే కథ, కాలుష్యంలో భూగ్రహం మాడిపోవడం భూమిపై ఉన్న జీవరాశి నశించడం, ఎక్కడో స్పేస్‌షిప్‌లో స్థిరపడిన భూలోకవాసి తిరిగి భూలోకం మీదికి వచ్చి తన దగ్గరనున్న జీన్స్‌బాంక్ ఆధారంగా నూతన సృష్టికి పూనుకోవడం లాంటి సైన్స్ ఫిక్షన్ కథలు వచ్చాయి.

## 8. వర్గపోరాట కథలు

కూలీలు, కార్మికులు, ఉద్యోగుల శ్రమ దోపిడి—తక్కువ వేతనాలతో, ఎక్కువ చాకిరీ చేయించుకునే కంపెనీలు, కార్మికుల హక్కులను కాలరాచే

యజమానుల నియంతృత్వ ధోరణులు, సమ్మె రాజకీయాలు, లైంగిక వేధింపులు, ఇన్స్యూరెన్స్ తమాషాలు కనిపిస్తాయి. ఇందులో కొత్తగా బీడి కార్మికులు, గని కార్మికుల జీవితాలను వివిధ కోణాలనుండి అధ్యయనం చేసిన మంచి కథలు రావడం విశేషం.

గిరిజనుల కథలు చాలామటుకు మూసలో వచ్చినవే. గిరిజనులు దోపిడికి గురికావడం రేప్‌లు-జైళ్ళు-హత్యలు చివరికి గిరిజనుడు గొడ్డలి ఎత్తడంతోను, తుపాకి పట్టడంతోను, ముగుస్తాయి. ఇది ఎక్కువగా సాహిత్య పత్రికలలో వచ్చే ధోరణి దీనికి భిన్నంగా ఫణికుమార్ గిరిజనుల ఆచార వ్యవహారాలను వస్తువుగా తీసుకొని చక్కని కథలను వ్రాశారు. గిరిజనుడు పై అధికారిగా వస్తే మిగతావాళ్ళ ప్రవర్తన ఎలా వుంటుందో తెలియజేసే కథలు, ఆ గిరిజనుడి పై ఆధిక్యత చూపించుకోవాలనే ధోరణులు. కొన్ని సందర్భాలతో న్యాయం అనిపించినా గిరిజనుడు ఏమి చేయలేని పరిస్థితులను కళ్ళకు కట్టినట్లుగా వివరించారు. దోపిడికి గురికాబడే గిరిజనుడే తన స్థాయి మీరిన తర్వాత మిగతా గిరిజనులపై దోపిడికి ఎలా వత్తాసు పలుకుతున్నాడో తెలియజేసే కథలు కూడా రావడం విశేషం. నాగరికత ముదిగి గిరిజనులు తమ సమూహం నుండి ఎలా వేరుచేయబడుతున్నారో తెలిపే కథలు కూడా వచ్చాయి.

## 9. బాల్య స్మృతులు

బాల్యం-బాల్య స్మృతుల గురించి 'శ్రీకాంత్' నుండి 'నవరాత్రి' వరకు నవలలు వచ్చాయి. కాని కథలు మాత్రం ఎక్కువగా రాలేదు. ఎందుకంటే కథలకున్న ఫ్రేమ్‌లో వాటిని పూర్తిగా చెప్పలేం కాబట్టి. ఒక జ్ఞాపకం ఒక కథగా మారుతుంది. కాని దానిని పొడిగిస్తే కథల సంపుటి అవుతుంది. వీటికి ఒక క్రమ పద్ధతిన జ్ఞాపకాలను నెమరేసుకుంటూ కథలుగా అందించిన నామిని సుబ్రహ్మణ్యనాయుడు కథలను పరిశీలిద్దాం.

1. పచ్చనాకు సాక్షిగా —బాల్యం
2. సినబ్బ కథలు —కౌమారం
3. మిట్టూరోడి కథలు —యవ్వనం

ఇలా తన జ్ఞాపకాలను విస్కృతం చేసుకొని కథల రూపంలో అందించారు. ఈ కథల సంపుటాల్లో వరుసగా ఇల్లు, బడి, ఊరు కేంద్రం బిందువుగా ఇదే వరుసలో కథలను చెప్పుకుంటూ వచ్చారు. బాల్య స్మృతులను హృదయానికి హత్తుకునేట్లుగా చిత్రించినా ఆ ఆర్ద్రత మిగతా రెండింటిలో లోపించడం మనం చూడ వచ్చును. చివరికి మిట్టూరోడి కతలు, మామూలు కాలక్షేప కబుర్ల స్థాయికి చేరుకుంది. దీని వైఫల్యం తో బహుశా నామినీ స్మృతుల శకం ముగిసినట్లే అని చెప్ప వచ్చును.

## 10 ఫెమినిస్టు కథలు :—

ఫెమినిజం ఈ మధ్య కాలంలో వచ్చిన సరికొత్త భావజాలం. ముఖ్యంగా ఈ భావజాలం లోని అంశాలన్నీ ధనిక వర్గ కుటుంబాలకు చెందినవని చెప్పవచ్చు సెక్సులోని వైపరీత్యాలు. వైయక్తిక అనుభవాలు, పురుష ద్వేషం ప్రధాన వస్తువుగా తీసుకున్నా, ఉద్యోగం చేయని స్త్రీని ఉద్యోగానికి పురికొల్పడం—ఉద్యోగం చేస్తున్న స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం-ఉద్యోగినులను ఇంటా బయట వేధిస్తున్న సామాజిక సంబంధాలు స్త్రీల అణచివేతకు సంబంధించిన వంటివి సకృత్తుగా కనిపిస్తున్నాయి. స్త్రీ పురుష సమానత, వరకట్న నిర్మూలనం.

అత్త ఆడబిడ్డల వేధింపుల వంటి వస్తువును తీసుకొని ఇదివరలో కథలు చాలానే వచ్చాయి. కాని ఈ ఫెమినిస్టు భావజాలంతో వీటిని మరికొంత నేర్పుతో చిత్రించడం ప్రధానంగా కనిపిస్తుంది. ఇటీవల కాలం లో వస్తున్న కథలకు 'అబార్షన్' 'ఋతుస్రావం' యవ్వనపు చిహ్నాలు స్త్రీ వేషధారణ మున్నగు వాటిని వస్తువుగా తీసుకుని వస్తున్న కథలు కూడా కొన్ని కనిపిస్తున్నాయి. ముఖ్యంగా అబార్షన్ గురించి, భార్యను స్కానింగ్ చేయించడం—కూతురు పుడుతుందని తెలిసి అబార్షన్‌కు ఒత్తిడి చేయడం, అత్తారింటివారు అబార్షన్‌కు ఒత్తిడి చేయడం—నిరాకరిస్తే హింసించడం—చివరకు కథానాయకి వీరందరినీ ఎదిరించి ఇంట్లోంచి వెళ్ళిపోవడం కనిపిస్తుంది. ఈ విషయంలో కథానాయకికి అంతటా వ్యతిరేకత ఎదురయినా, తల్లిదండ్రులు కూడా సపోర్టు ఇవ్వకపోయినా ఎదిరించాలనే నిర్ణయానికి రావడం కనిపిస్తుంది. ఒక కథలో కన్నతండ్రి అల్లుడి కర్కశత్వాన్ని గుర్తించి కూతుర్ని స్వయంగా అబార్షన్‌కు తీసుకు వెళ్ళడం (ఆమె కోర్కె పైనే) కనిపిస్తుంది. అయితే ఇలాంటి కథల్లో కథానాయకి ప్రతిఘటనా ధోరణులను చూపించినా, పుట్టింటివారు విద్యాధికులు, మేజిస్ట్రేట్‌లు అయినా ఆమెను నిరాశపరచడం కనిపిస్తుంది. మొత్తం మీద పురుషాధిక్యతను, కుటుంబంలోని అత్త ఆధిక్యతను ఎదిరించే విధంగా కథలు రూపొందాయి. వీటన్నింటిని అపహాస్యం చేసే విధంగా ఒక కథలో ఒక డాక్టర్ అవకాశవాద ధోరణులు కల యువతులు అబార్షన్‌ను తమ విచ్చలవిడి ప్రవర్తనకనుగుణంగా ఎలా వాడుకుంటున్నారో కొన్ని ఉదాహరణలతో వివరించిన కథలో కథనం చాలా తేలికగా వుండి కబుర్ల స్థాయికి మారి ఎవర్నీ ఆకట్టుకోలేకపోయింది.

అయితే యిందులో భాగంగా దాంపత్య సమస్యలు, లైంగిక సమస్యల మీద వచ్చిన కథలను వేళ్ళమీద లెక్కపెట్టినా, వస్తువురీత్యా కథా పరిణామదశలో ఉత్తమమైన మార్పు ఇవి అని చెప్పక తప్పదు.

## 11. ఇతరములు:

పైన వివరించినవే కాకుండా స్వాతంత్ర్యం రాకముందు అప్పటి కాలమాన పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని చక్కటి కథలను ఆంగ్లరాజ్య కథల పేరిట సదాశివరావుగారు వ్రాశారు. ఇటీవలి కాలంలో దళిత సాహిత్యం మీద విస్తృతంగా చర్చ జరుగుతున్నా, వాటికి సంబంధించిన కథలు మాత్రం ఏమీ రాలేదు.

కుటుంబ సంక్షేమంలాంటి జనాకర్షక పథకాలు ఆధారంగా కొన్ని పత్రికలు కథలను ఆహ్వానించగా మరికొన్ని పత్రికలు హాస్యకథలు, శృంగారకథలు, చెత్తకథలు, పరమచెత్త కథలు పోటీలు కూడా నిర్వహించాయి.

## రూప పరిణామం

కథలు.... చిన్నకథలు... పెద్దకథలు... అంతే పెద్ద భేదం ఏమీలేదు. కథను సాగదీసి పెద్దకథగా తయారుచేయడం దాన్ని నవలికగా పేర్కొనడం మామూలైపోయింది. ఒక నవలిక, దానికి రెండు కథలు కలిపి నవలగా ప్రచారం చేయడం కూడా ఆనవాయితీ అయిపోయింది.

ఇక చిన్న కథలు గల్పికగా, స్కెచ్‌లుగా రూపం మారివచ్చినా ఈ దశాబ్దంలో మినీకథలు, ఒకపేజీ కథలు, కాలమ్ దాటని కథలు, కార్డు కథలు పేరుతో కథలు వెలువడినాయి. ఏ రూపంలో వెలువడినా ఇవి ముఖ్యంగా స్పేస్ ఫిల్లర్స్‌గా

మాత్రమే ఉపయోగపడినాయనడం మాత్రం నిజం. ఈ కథలు కథల్లా ఉండవు. ఒక చిన్నా జోక్ లేదా ఒక చిన్న సంఘటనను సాగదీసి కథల్లాగా మలచినా ఎక్కువశాతం కథలు సహజత్వం లోపించినవే. కొత్తగా కలం పట్టిన వాళ్ళు, ఉత్తరాల రచన నుండి కథకులు కావాలనుకునే వారు ఎక్కువగా ఇలాంటి ప్రక్రియలను ఎన్నుకుంటారు.

కొన్ని కథలు ఒక ఉత్తరంతో మొదలై పూర్తవుతాయి. మరికొన్ని కథలు ఉత్తరాల పద్ధతిలో నడుస్తాయి. డైరీ పద్ధతి, జ్ఞాపకాలు, గత స్మృతుల పద్ధతి పాతబడి పోతుంది.

కొన్ని పత్రికలు కొన్ని బొమ్మలను లేదా ఒక కార్టూన్‌ను ఇచ్చి వాటి ఆధారంగా కథ వ్రాసి పంపించమని కోరగా, కొన్ని పదాలను, లేదా ఒక సామెతనో, నీతి వాక్యాన్ని ఇచ్చి వాటి ఆధారంగా కథలు వ్రాయవలసిందిగా మరికొన్ని పత్రికలు ప్రోత్సహించాయి.

ఒక దినపత్రిక ఒక ఎడిషన్‌లో 'నేటి కథ' శీర్షికలో ప్రతిరోజూ ఒక చిన్న కథ వేస్తుంటారు. ఒక సంవత్సర కాలంలో వచ్చిన కథలన్నీ వడబోసి 4[illegible] కథల్ని ఎంచుకొని కాళీపట్నం రామారావుగారి సంపాదకత్వాన ఒక పుస్తకం వెలువడింది కూడా. ఇందులో వస్తు వైవిధ్యంతో కూడిన కథలు కొత్తా, పాత రచయితలు రాయడం విశేషంగా చెప్పుకోవచ్చు.

రూప పరిమాణంలో వచ్చిన మార్పులను వివరించే కథలను ఈక్రింది విధముగా విభజించవచ్చును.

కాలు:—

వీటిలో కథ సాగినతీరు వచన కవిత్వంలా సాగుతుంది. వర్ణనలతో వ్రాసిన విధం కవిత్వంలా మారుతుంది. విడిగా కొన్ని వాక్యాలను కత్తిరించి చూస్తే కవిత్వం అని భ్రమపడే ప్రమాదముంది. ఇలాంటి కథలు వ్రాయడం అందరి వల్లాగాదు. ఎన్నుకునే అంశం, చెప్పదల్చుకున్న తీరు, చెప్పేవిధానం చేయి తిరిగిన వాళ్ళకే సాధ్యం. ఇలాంటి వాటిలో ముందుగా బి.ఎస్.రాములు రాసిన 'పాలు' కథ. ఇందులో ఎల్లవ్వని కొడుకు గంగపోషం శ్రమకు తగ్గ వేతనం, సమాన న్యాయం గురించి ప్రశ్నించి తల్లిలో మార్పును తీసుకురావాలని ప్రయత్నిస్తాడు. ప్రారంభమే,

వర్షం...ఒకటేవర్షం... ముసురు. ఎటుచూసినా ముసురు, చినుకులు, తుంపరచినుకులు, ఈదర, చలి చలిఈదర.

విడువని దుఃఖంలా వెలువని వర్షం తెరలు తెరలుగా, పొరలుపొరలుగా పొంగుతూ వల్లారుతుంది. దోపిడిని వర్ణించిన విధం,

మంచులా కరిగిన గ్లాసులోని పాలు
తన సత్తువ, తన నెత్తురు
ఎందరిదో సత్తువ, ఎందరిదో నెత్తురు
కరిగి మరిగి తెల్లనైన పాలు
ఎర్రని రక్తం
తెల్లనిపాలు
అన్న పంతులు పాలు

ఫలితమంతా పంతులు పాలు
కష్టమంతా తమపాలు.

ఈ కథను చిన్న వాక్యాలతో కవితాత్మకంగా రచయిత తీర్చిదిద్దాలనుకున్నా చివరి వరకు అలా కొనసాగించడంలో విఫలమయ్యాడు. మధ్యలో

సంభాషణలు ఆ స్థాయి నుంచి తప్పుకోగా వర్ణనలు మాత్రం కవిత్వంలా కొనసాగుతాయి. ఈ కథను రావిశాస్త్రిలా అనుకరించాలని ప్రయత్నించినా సక్సెస్ మాత్రం కాలేదు. ముఖ్యంగా పంతులు గురించి వచ్చిన వర్ణన రావిశాస్త్రిని తప్పక గుర్తు చేస్తుంది.

ఇక బీనాదేవిగారి 'అతడూ—ఆమె' కథ మొత్తం వచన కవిత పాదాల్లా నడిచిపోతుంది. వాక్యాలను అలవోకగా తుంచి పేర్చిన వరుసలు. చిన్న చిన్న వాక్యాలు, మూడే పాత్రలు. అతడూ, ఆమె, జైలు, సూపర్నెంటూ. రాజకీయ నేరంపై ఉరితీతకు సిద్ధమైనా అతడు—చివరి చూపుగా జైల్లో చూడటానికి వచ్చిన ఆమె—ప్రేక్షకుడిగా సూపర్నెంటు కథ ప్లాటు చిన్నదే. కథనం నడిచిన తీరు అద్భుతం. కవిత్వంలాగే సీరియస్ గా చదవక పోతేకథ అర్థం కాదు

**భాష :—**

కథల్లో భాషను మైనపుముద్దలా మలచ గలిగిన రచయితలు చాలా మందే కనిపిస్తున్నారు. కాని ఈ మధ్య కాలంలో మాండలిక భాషను మరింత శక్తి వంతంగా ప్రయోగించటం వలన కథ రూప పరిణామంలో ఒక మెట్టు ఎదిగిందనే చెప్పాలి. వీటిని మాండలిక కథలు అని కూడ అనటం సహజం అయిపోయింది. రచయిత మామూలు భాషలో వుండి పాత్రలు మాత్రం ఆయా ప్రాంతాల మాండలికంలో వుండటం. రెండవది పాత్రలు మరియూ రచయిత కథా కథన పద్ధతి కూడ మాండలికంలో వుండటం. ఇది పాఠకులను ఆ వస్తువులో సంలీనం చేసి గాఢమైన ముద్రను వేస్తుంది. ఆ మధ్య కాలంలో తెలంగాణా మాండలికంపై రూపపరంగా చాల చర్చలు కూడా జరిగాయి ఇది చాల మందిని చదివించలేక పోతుం దనే అపప్రథ కూడా కలిగింది. అయినా ఇది క్రమంగా నిలద్రొక్కుకుని ప్రత్యేకతను నిలుపు కుందని చెప్పవచ్చు.

నామిని తన కథల వలన పాఠకులలో మాండలిక కథలపట్ల కొత్త ఆకర్షణను, ఆసక్తిని కలిగించగలిగాడు. తన స్మృతులను మాండలికంలో జోడించబట్టే వాటికంత పేరు వచ్చిందని వాదించే వారున్నారు. మాండలికాల వల్ల వాటికి సహజత్వం వచ్చినా అది పరిమిత పాఠకులనే ఆకర్షిస్తుంది అన్నవాదం కూడా నామిని కథలవల్ల చెరిగిపోయిందనే చెప్పవచ్చును.

## ముగింపు

**1985** నుండి కథా సాహిత్యంలో సరికొత్త మార్పులు వస్తూండటం శుభసూచకం. కథలో కథనంలో, వస్తువైవిధ్యంలో కొత్తదనం కనిపిస్తుంది. కథకు ఉన్న ప్రాముఖ్యత పోలేదు. ఎంత పెద్ద పత్రికలైనా, సీరియల్స్‌తో నడిచే పత్రికలైనా కథలు లేనిదే గడవదు. ఈనాడు కొత్తగా వెలువడుతున్న దినపత్రిక అనుబంధాలలో కూడా కథలు తప్పనిసరిగా ఉంటున్నాయి. ఈనాడు సాహిత్య పత్రికలే కాకుండా దినపత్రిక అనుబంధాలు, ఇండియా టుడే, విపుల, ఆంధ్ర ప్రభ లాంటి కొన్ని పత్రికలు మంచి కథలకే ప్రాముఖ్యత ఇవ్వడంవల్ల మంచికథలు రావడానికి అవకాశ ముంది. సమస్యలను పరిష్కరించే పద్ధతులను సూచించకపోయినా, సమస్య చిత్రణ గల కథలనైనా నిజాయితీగా వ్రాయడం ఒక విశేషమయితే, మామూలు కథలు వ్రాసే నిన్నటితరం రచయితలు ఒక ప్రత్యేక పంథాలో కథలు వ్రాయడం మరొక విశేషం. కె. రామలక్ష్మిగారిని ఇందులో ఉదాహరణగా చెప్పవచ్చును. అల్లం రాజయ్య కథలు వ్యాపార పత్రికల్లో రావడం ఇంకొక అద్భుతంగా చెప్పుకోవచ్చును. ఏది ఏమైనా కథానికా సాహిత్యం మరీ నిరాశపరచే విధంగా లేదు. మంచి కథలు ఎన్నో వస్తున్నాయి వస్తూంటాయి చదివే పాఠకులు తగ్గినారేమోకాని. మంచి కథలు రావడం మాత్రం తగ్గలేదు.

# సోమనాథుని రచనలలో స్త్రీలు

పి. పద్మ

పాల్కురికి సోమనాథుని పేరు తెలుగు సాహితీ జగత్తుకో సుపరిచితమైనది మరియు ప్రసిద్ధమైనది. ఇతడు వరంగల్లు జిల్లాకు దగ్గరలో నున్న 'పాలకురికి' గ్రామవాస్తవ్యుడు, ప్రతాపరుద్ర చరిత్ర ద్వారా ఇతడు కాకతి రాజన్యుడు, రెండవ ప్రతాపరుద్రునికి సమకాలికుడని తెలుస్తోంది. తోంటద సిద్ధలింగకవి, తన పాలకురికి సోమేశ్వర పురాణంలో ఇతడు గొలనుపాక సోమేశ్వరస్వామి వరప్రసాదం వల్ల పాలకురికి గ్రామంలో జన్మించినట్లు వ్రాసియున్నారు. ఆ పాలకురికి గ్రామం నేడు పాలకుర్తిగా వ్యవహరింపబడుచున్నది. జన్మముచే బ్రాహ్మణుడయినప్పటికి బసవేశ్వరుని వీరశైవ సంప్రదాయము పట్ల ఆకర్షితుడై జంగమ కులజాడైనట్లు చెప్పుకున్నాడు. ఈ వీరశైవ సంప్రదాయము మొట్టమొదటగా క్రీ.శ. 12వ శతాబ్ది అంతము, 13వ శతాబ్ది ప్రారంభంలో కర్ణాటకలో బసవేశ్వరునిచే ప్రచారం కావించబడినది. త్వరలోనే ఆంధ్ర దేశానికి కూడ వ్యాప్తి చెందింది. సహజ శైవ భక్తుడైనందువలన, పాల్కురికి సోమనాథుడు వీరశైవ ప్రచారానికి దీక్ష అవలంబించాడు. అతని ప్రచారానికి దేశి సాహిత్యాన్ని మాధ్యమంగా ఎన్నుకున్నాడు. సోమనాథుడు బహు భాషా పరిజ్ఞాని, సంస్కృతాంధ్ర, కర్ణాట భాషలే కాకుండా, తమిళ మహారాష్ట్ర భాషలలో కూడా పరిచయం సంపాదించిన గొప్ప పండితుడితడు.

ఈతని ద్విపద కృతి 'పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణంలో వరుస జనుల వర్ణనల సందర్భంగా, కన్నడ పరుస నడకలు, అరె పరుస నడకలు, అరువదేశ పరుస నడకలు, ఆయా భాషలలోనే రచియింపబడి అతని సాహితీ పాండిత్యానికి తార్కాణములుగా నిలిచి యున్నాయి.

సోమనాథుని కృతులు మనకు దాదాపుగా 29 వరకూ లభిస్తున్నాయి. అయితే వీటిలో ఎక్కువ భాగం తెలుగు, కన్నడ భాషలలోనే రచియింప బడినవి వీటిలో ముఖ్యమైనవి, 'అనుభవ సారము' 'చతుర్వేద సారము' 'పండితారాధ్య చరిత్ర', 'బసవపురాణము', 'వృషాధిపశతకము' మొదలగునవి. అవి అన్నియు శివభక్తి రస పూరితములే. ఇతని రచనలలో మనకి బసవేశ్వరుని శివుని వాహనమైన నందియొక్క అవతారంగా కొలవబడినట్లు కనపడుతుంది. వీరశైవ సిద్ధాంతాలని వివిధ భక్తుల కథలతో ముడివేసి వారిని ఆదర్శప్రాయులుగా తీర్చిదిద్దటము సోమనాథుని ప్రత్యేకత. ఇతర సమకాలీన కవుల వలె

షేక్ పేట్ నాలా, గోల్కొండ పోస్టు, హైదరాబాదు–500 008.

సంస్కృత రచనలు తెలిగించటం కాని, సంస్కృత కావ్యాల్లోని ఇతివృత్తాలు ఆధారంగా రచన సాగించడ కాని లేక ఇతని రచనలు ఇంచుమించుగా స్వతంత్రముగా ఉంటాయి. అంతేకాక, సోమనాథుడు తన రచనలలో అంగాంగ వర్ణనకు ప్రాధాన్యత ఇవ్వలేదు. అలాగే ఇతని ఇతివృత్తాలు కూడా [illegible]జుల రా[illegible]జుల లేదా సమాజంలోని ఉన్నత స్థాయి వర్గాల చెందిన వ్యక్తుల చరిత్రలు కావు సమాజంలో వివిధ వర్గాలవారిని, ముఖ్యంగా క్రింది స్థాయి వారిని పాత్రలుగా తీసుకొని, వారి భక్తి ప్రాతిపదికగా అల్లిన రచనలు ఇవి. అందువల్ల ఇతని రచనల్లో అడుగడుగునా, సామాన్య జీవితం దేశీయ విజ్ఞానం ప్రతిబింబిస్తూ ఉంటాయి.

మధ్యయుగంలోని ఇతర భక్తి ఉద్యమాల లాగానే వీర శైవం కూడా సమాజంలోని వివిధ వర్గాల మధ్య ఐక్యత కొరకు కృషిచేసింది. బసవేశ్వరునిచే సంస్కరించబడిన ఈ ఉద్యమం అనతి కాలంలోనే కర్ణాటక ప్రాంతమంతా బహుళ ప్రచారం పొందింది. బసవేశ్వరుడు కాలచుర్యరాజు బిజ్జలుని దండనాథుడు. కళ్యాణి ఈ కాలచుర్య రాజుల రాజధాని. వీరశైవ ఆచార్యులను 'జంగములు' అని వ్యవహరిస్తారు. వీరు బ్రాహ్మణ వంశీకులైనా, ఉపనయన సంస్కారములను త్యజించి, వీరశైవ దీక్ష పొందినవారు. సమాజంలోని వివిధ వర్గాల మధ్య అసమానతలను తొలగించడము, స్త్రీలకు పరిపూర్ణ మత స్వేచ్ఛ నివ్వడము, మతముపై బ్రాహ్మణాధిక్యతను వ్యతిరేకించడము మొదలైనవి ఈ ఉద్యమముయొక్క ముఖ్యఉద్దేశములు. బసవేశ్వరుడు అగ్రవర్ణాలకే పరిమితమై యున్న ముక్తిమార్గమును సమాజంలోని అన్ని స్థాయిలకు కూడా అందించడానికి ప్రయత్నం చేశాడు. అతని దృష్టిలో దేవునికి, భక్తునికి మధ్య సంబంధం, భార్యాభర్తల మధ్య ఉన్నటువంటి అనుబంధంతో సమానమైనది. ఈ విధమైన అనుబంధంలో బ్రాహ్మణుల జోక్యాన్ని, అధికారాన్ని అతడు పూర్తిగా వ్యతిరేకించాడు. అలాగే ప్రతివ్యక్తి యొక్క వ్యక్తిగత నమ్మకాలకు ప్రాధాన్యతనిస్తూ, సమాజంలోని స్త్రీ పురుష భేదాలను, వివాహం ద్వారా సహజంగా పురుషునికి స్త్రీపై సంక్రమించే అధికారాన్ని బసవన్న ఒప్పుకోలేదు వీరశైవం ఒకదశలో దేవాలయ వ్యవస్థను కూడా ధిక్కరించి, వ్యక్తిగత ఆరాధనకు ప్రత్యేక స్థానాన్ని ఇచ్చింది. వీరశైవులు 'దీక్ష' ద్వారా తమ గురువులచే లింగధారణ పొంది, సర్వకాల, సర్వావస్థల యందు లింగమును ధరించియే ఉందురు. ఈ దీక్షా సంస్కారం స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తుంది. మరొక విప్లవాత్మకమైన వీరశైవ సిద్ధాంతము—'పంచమహాసూతకములను' త్యజించటము. అనగా, స్త్రీకి సహజంగా సంక్రమించే ఋతుక్రమ ప్రసూతి మొదలైన శౌచ్యాలను త్యజించటము. ఈ విధంగా వీరశైవం ఆనాటి సమాజంలో ఒక వినూత్న ధార్మిక మత విప్లవాన్ని లేవదీసింది.

ఆంధ్రదేశంలో ఈ వీరశైవ మతోద్యమాన్ని మొదటగా విస్తృత ప్రచారం చేసినవారు—శ్రీపతి పండితుడు' 'శివలెంక మంచన పండితుడు' మరియు 'మల్లికార్జున పండితుడు' వీరు ముగ్గురినీ 'పండితత్రయం' అని కూడా వ్యవహరిస్తారు. మల్లికార్జున పండితుడు బసవేశ్వరునికి సమకాలికుడు. ఇతడు వీరశైవానికి ఆంధ్రదేశంలో వేదప్రామాణ్యాన్ని కలిగించాడు. ఇతడు తన 'శివతత్త్వసారము'లో బ్రాహ్మణాధిక్యాన్ని ధిక్కరించాడు. అలాగే శివభక్తికి లింగభేదము, పురుషాధిక్యత కూడదని వాదించాడు. శివభక్తిలేని భర్తను భార్య వదలి వేయవచ్చని ప్రబోధించాడు.

శివభక్తుఁడ వగుమని పతి
ననిరతమును బుద్ధిచెప్ప నగు శివభక్తిం
దవిలిన సతి శతఁడౌదఁ బడఁ
డవు నేనియు నతని మీఱ నగు భక్తి మెయిన్

మఱియు,

పురుషునకు భక్తిలేదని
పురుషేచ్ఛకు నడవ జనదు పురహర భక్తిన్
బరగు సతి పురుషు మీఱియుఁ
బురహరుఁ గొలుచునది సిత్తమున విడిచి
పతిన్.

అయితే, బసవేశ్వరుడు వాదించినట్లుగా, ఉపనయన సంస్కారాన్ని త్యజించి, వీరశైవదీక్ష పొందడానికి మల్లిఖార్జున పండితునికి సాధ్యం కానట్లుగా తెలుస్తోంది.

ఈ విధమైన స్వల్ప విభేదాలవల్ల, ఆంధ్రలోని ఈ శైవ సంప్రదాయాన్ని 'ఆరాధ్యశైవం'గా వ్యవహరిస్తారు. సోమనాథుడు కూడా మల్లిఖార్జున పండితుడ్ని అనుసరిస్తూ తన వీరశైవ ప్రచారాన్ని కొనసాగించినట్లుగా అనిపిస్తుంది. ఈ విషయాలన్నింటినీ ప్రాతిపదికగా తీసుకొని సోమనాథుని రచనలలో స్త్రీపాత్రల చిత్రణ, సమాజంలో వీరి స్థాయి, మతపరంగా వారికి లభించిన స్వేచ్ఛ ఎంతవరకూ ఉండేవో తెలుసుకోవడానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసముయొక్క ముఖ్య ఉద్దేశ్యం.

ఈ వ్యాస రచనకు సోమనాథుని రచనలైన 'బసవపురాణము', 'పండితారాధ్యచరిత్ర' రెంటినీ ప్రామాణిక గ్రంథాలుగా తీసుకోవడం జరిగింది. 'బసవ పురాణం' వీరశైవ మతోద్ధారకుడైన బసవేశ్వరుని జీవితమును అభివర్ణించే స్వతంత్రగ్రంథం. మరికొంత మంది శైవ భక్తుల కథలు కూడా సందర్భానుసారంగా ఇందులో చేర్పించబడినవి. అలాగే 'పండితారాధ్యచరిత్ర' కూడా ఆంధ్రలో వీరశైవ (ఆరాధ్య) మతప్రాప్తికై తన జీవితాన్ని అంకితం చేసిన మల్లిఖార్జున పండితారాధ్యుని చరిత్ర. ఇందులో కూడా సందర్భోచితంగా పురాతన శైవ భక్తుల కథలు చేర్చబడ్డాయి. ఈ రెండింటినీ నిశితంగా పరిశోధించి, స్త్రీలకు సంబంధించిన ఇతివృత్తాలనూ వివరంగా, లోతుగా ఆకళింపు చేసుకుంటే మనకు ఆనాటి కాలంలో స్త్రీల జీవితాంలోని వివిధ అంశాలు తేటతెల్లమౌతాయి.

బసవేశ్వరుని తల్లి "మండెగ మాదిరాజు" భార్య అయిన 'మాదాంబ' చరిత, ఒక ఉత్తమ స్త్రీ జీవితాన్ని చక్కగా ప్రతిబింబింప చేస్తుంది. ఆమె పతివ్రత, సదాచార పరాయణురాలు. సంతానార్థియై అనేకనోములు, వ్రతాలు ఆచరించింది. బ్రాహ్మణుల ఉపదేశంవల్ల నందికేశ్వరుని నోము కూడా శుచిగా శ్రద్ధగా ఆచరించింది ఈ సందర్భంగా కవి నందికేశ్వరుని నోము నోచుకునేపద్ధతి పూజావిధానం మొదలైనవి చక్కగా తెలియ చెప్పాడు. ఈ వ్రతప్రభావం వలన అనతికాలానికే ఆమె గర్భం ధరించడం జరుగుతుంది ఇక్కడ మాదాంబ గర్భం యొక్క వివిధ దశల సందర్భోచిత వర్ణన కవి వాస్తవిక జీవితాన్ని, స్త్రీ స్వాభావిక మార్పులను నిశిత దృష్టితో పరిశీలించాడనే విషయాన్ని చెప్పక చెపుతోంది.

మగువ కంతట నెల మసలెఁ దోడ్తో
తగ గర్భ చిహ్నముల్ దానంకురించె;
అమృతాంశుడగు పుత్రుడతివ గర్భమున
అమరియుండుట నొక్క; అకలిగాదు;

జలజాక్షి కడుపున సద్భక్తి రుచికు
దరుచునో తుచుల రుచులైతోచె;

పాండురంగని మూర్తి పదతిగర్భమున
నుండుటనో! వెలరాండె మైందీగ
పదతి శీతవృ జాలు భవి పాకములకు
నొదబడకునికినో మోకిళ్ళు పుట్టె....

అనాటి సమాజంలో కుటుంబములోని తల్లి పాత్రకు చాలా ప్రాధాన్యత ఇవ్వబడింది. తల్లి తన బిడ్డలను సున్నితంగా, అప్యాయంగా పెంచి పెద్ద చేస్తుంది. వారి అన్ని వ్యవహారాలలోను ఉదాహరణకు విద్య, వివాహం, పండుగ, సంస్కారములు అన్నింటిలోను తోడునీడగా నిలుస్తుంది. బెజ్జమహాదేవి అనే శివ భక్తురాలు. శివునికి తల్లిలేదని బాధపడుతుంది. "తల్లిలేనప్పుడే శివుడు చాల గొప్పవాడైనాడు, తల్లి ఉంటే మరెంత గొప్పవాడవునో కదా'': అని తలపోస్తుంది. శివునికే కనుక తల్లి ఉంటే శివుని పస్త్రధారణ, నడక రీతులు అలా ఎందుకు ఉండేవని ప్రశ్నిస్తుంది.

'తల్లి కల్గిన ఏల తపసి కానిచ్చు
తల్లి గల్గిన ఏల తల జడల్గట్టు
తల్లి యున్న విషంబు ద్రావ నేలిచ్చు
తల్లి యుండిన తోళ్ళు దాల్పనేలిచ్చు'

అంటూ ఇంకా యిలా తలుస్తుంది——

'జన్నిచ్చి పలుమారు వెన్నయుంబెట్టి
పన్నుగా నిన్నియుం జాలనుబోసి
ఆకొవగా గడు పరసి పాలిచ్చి
సాకించి పెనుపదే జనని గల్గినను
తగిన పోడిమి సేయు తల్లి లేకున్న
పగవరే మరి యెట్టి మగబిడ్డలైన'

అందువలన తనను శివునికి తల్లిగా భావించి, అతనిని చిన్న బిడ్డతుగా చేరదీసి, స్నానము చేయించి, పాలిచ్చి, లాలించి, జోలపాటలు పాడి, నిద్రపుచ్చుతుంది. ఈ కథ ద్వారా సోమనాథుడు మాతృవాత్సల్యమును కళ్ళకు కట్టినట్లుగా చూపించాడు. అంతేకాక మనకి ఆ కాలములో పిల్లలను పెంచే విధానము, వారికి వచ్చే చిన్న చిన్న ఆరోగ్య సంబంధకరమైన ఇబ్బందులు, మొదలగునవి అవగతమౌతాయి. ఈ విధంగా తల్లిగా కుటుంబంలో స్త్రీ పాత్రను చక్కగా తెలియచెప్పాడు సోమన.

పిల్లలకు ఆటవస్తువులన్నా, తినుబండారాలన్నా చాలా ప్రీతి. అందునా ఆడపిల్లలకు బొమ్మలు, బొమ్మ పొత్తికలు వంటివి అంటే మరింత మోజు. 'గొడగూచి' కథలో మనకు ఈ విషయాలన్నీ తెలుస్తాయి. శివుడు త్రాగకపోతే, అమాయకురాలైన గొడగూచి శివుని తన ఆట వస్తువులన్నీ ఇస్తానంటుంది. అలాగే వీరభద్రుని జాతరకు తీసుకుని వెళ్ళి రథాన్ని లాగిస్తానంటుంది. పాలకొంత తగ్గిందనో లేక పాలుపోసిన పాత్ర మరీ పెద్దగా ఉందనో అనుమానపడుతుంది. ఎప్పటికీ శివుడు పాలు త్రాగకపోతే నేలమీద పొర్లి, కాళ్ళు, చేతులు తన్నుకుని మారాం చేస్తుంది. చివరికి ఏలాగైతేనేం, శివుని ప్రత్యక్షం చేయించుకుని పాలు త్రాగించడంలో సఫలీకృతురాలౌతుంది. ఇలా 'గొడగూచి' కథ ద్వారా చిన్నపిల్లల అమాయక ధోరణులను, ఆనాటి వారి వినోద పద్ధతులను పొల్లుపోకుండా చూపిస్తాడు కవి.

వివాహం ఆనాడి సమాజంలో ఒక బలమైన వ్యవస్థగా రూపొందింది. దక్షిణాది రాష్ట్రాలలోను, ఆపస్తంభ ధర్మసూత్రాలను పాటించే వారిలోనూ మనకు కనిపించే ఆచారం మేనరికపు పెళ్ళిళ్ళు. ఈ విషయం మనకు బసవేశ్వరుని వివాహం ద్వారా దృగ్గోచరమౌతుంది. బసవన ఇల్లు వదలి వెళుతున్న సందర్భంలో మేనమామ బలదేవ దండనాయకుడు, అతనికి తన కుమార్తె గంగాంబ నిచ్చి వివాహం జరిపిస్తాడు. ఆ పెళ్ళి 'శివబలం దుగ్గలిం

చిన' ముహూర్తంలో జరిగిందట. అలాగే వివాహా నికి పుర వీథులన్నీ అలంకరించారు. ఎన్నో నృత్య గాన వినోద కార్యక్రమాలతో చాలా వైభవోపేతంగా జరిగిం దా వివాహం. ఈ సందర్భంగా సోమనాథుడు ఆనాటి సంపన్న ఆంధ్ర కుటుంబాలలో జరిగే వివాహ వేడుకలను స్పష్టంగా చిత్రీకరించాడు. వివాహ పవిత్రతను కూడ స్పష్టంగా తెలియ చెప్పాడు.

వివాహమైన స్త్రీలు సాధారణంగా చాలా పవిత్రంగా ఉండటం ఆనాటి ఆచారం. వారు భర్తలను వదలి ఒంటరిగా వీథుల లోనికి వచ్చేవారు కాదు. అలాగే వీథులలో జనం మధ్యగా నడిచేవారు కాదు. ఈ విషయాలన్నీ సోమన బసవనను బిజ్జలరాజు దండ నాయకునిగా చేసిన సందర్భంలో, బసవన కళ్యాణ పుర వీథులలో ఊరేగింపుగా వెళుతున్నప్పుడు ఆతనిని చూడటానికి తరలివచ్చిన స్త్రీల మధ్య సంభాషణ ద్వారా తెలియచెప్పాడు. కొద్ది మంది స్త్రీలు తమ మేడల మీద గవాక్షాల గుండా బసవనను వీక్షిస్తే, మరికొంత మంది పుర వీథుల లోనికి తరలివచ్చారు. ఆ సందర్భంలో ఒక స్త్రీ మరొక స్త్రీని పై విషయాల గురించి వారించగా ఆమె తన భర్త గమనించి తగవులాడినా లెక్క చేయుననడంలో వారి తిరుగుబాటు ధోరణులు తెలుస్తాయి.

వీరశైవ మతోద్యమం స్త్రీలకు పూర్తి మత పరమైన స్వేచ్ఛ నిచ్చిందనడానికి నిదర్శనాలు బసవ పురాణం లోనూ మరియు పండితారాధ్య చరిత్ర లోనూ కనిపిస్తాయి. వైరికవ్వ భర్త జైనాభిమాని. తన భార్యను జైనులకు విందు భోజనం ఏర్పాటు చేయమని ఆదేశించి, తాను జైన భక్తులను ఆహ్వానించడానికి వెళతాడు. వైజకవ్వ శైవ భక్తురాలు అయినందు వలన తాను ఆ విధంగా శైవ గురువులకు విందు చేయగలనో లేదో అని బాధ పడుతుంది. అదే సమయంలో శివుడు జంగమ రూపంలో ఆమె యింటికి భిక్షార్థియై వచ్చి, వండిన పదార్థాలు రుచి చూడడం జరుగుతుంది. అప్పుడే యింటికి తిరిగి వచ్చిన ఆమె భర్త ఆమె ప్రవర్తనను అనుమానించి, ఆమెను శారీరకంగా హింసించి ఇంటి నుండి వెడలగొడతాడు. అయితే ఆమె దగ్గరి లోని శివాలయానికి వెళ్ళి లింగైక్యం చెందుతుంది. ఆ సందర్భంగా సోమనాథుడు బసవన ద్వారా ఇలా చెప్పిస్తాడు.

> ''పురుషుడు శివ భక్తి విరహితుడేని
> బురుషుని మీఱుట దరుణికిఁ బథము
> దుర్గతిఁ బొంద దెందును బతిఁ బాసి
> భర్గుని గొనియాడు పడతి యన్నట్లు''

అలాగే పొట్ల చేఱువులోని దేశింగ బల్లహుడనే రాజు భార్య సుగ్గలాదేవి వృత్తాంతం కూడా ఈ విషయాన్ని బలపరుస్తుంది, ఆమె శైవాభిమాని, రాజు జైనుడు. ఒకనాడు ఆమె దేదర దాసిమయ్య అనే గొప్ప శైవ పండితుని ఆహ్వానించి, ఆదరిస్తుంది. దీనితో ఆందోళన చెందిన రాజు ఆమెతో ఇలా అంటాడు—

> ''సతి నొక్క గతియును పతి నొక్క గతియు
> నరిసి ఏ లోకంబునం దైనగలదె''

అని శివభక్తుని సాగనంపుమని, లేకుంటే జైనులు వినగలరు, ప్రమాదమని వారిస్తాడు. ఆమె కోపోద్రిక్తయై—

> ''పురుషునకు సతికి తెరు వొక్కడైన
> గురు శిష్యులకు వేఱె తెరువు గలవే
> స్త్రీ వివాహము నాడు సేసిన బాస
> నీవ విచారించుకో వేయునేల
> గడియించుకో భార్య గల దేని యోర్తు''

అని తన శివదీక్షను ప్రకటించి, భర్తని, మిగిలిన జైనులను ఆ శైవపండితుడైన దేదర దాసిమయ్యతో వాదానికి దింపి, ఓడించి, వారికి శివ దీక్ష నిప్పిస్తుంది.

సనాతన హిందూ సంప్రదాయం ప్రకారం వైధవ్యం పొందిన స్త్రీలు గృహాంతర్భాగము నుండి వెలుపలికి రారాదు. ఇతర పురుషులతో మాట్లాడరాదు. ఆభరణములు ధరించరాదు. పండుగలు మొదలైన శుభకార్యము లకు ముందుగా తరలి వెళ్ళరాదు. అయితే వీర శైవం దీనిని కూడ త్రోసి రాజని స్త్రీ పురుష సమానత్వ ధోరణు లను ప్రచారం చేయడంలో ముందంజ వేసింది. పండితారాధ్య చరిత్రలోని సూరసానమ్మ వోరంగల్లు అగ్రహారము నివాసి. విధవరాలు మరియు గొప్ప శివ దీక్షా పరురాలు. ఆమె శైవ భక్తులను ఇంటికి ఆహ్వానించడమేకాక వారితో తర్కములు జరపి, శైవ సంప్రదాయాలను చర్చించేది. అలా వచ్చిన వారికి, ఇతర శైవ భక్తులకు, జంగములకు భోజన సదుపాయాదులు కూడ కల్పించేది. ఇది గమనించిన ఆ అగ్రహార బ్రాహ్మణోత్తములు తమ గ్రామ పాలకునితో విన్నపించు కుంటారు.

> ''వైధవ్య వర్తనల్ పతిలేని పాల్సేసి
> యరయ నుమ్మెత్త కాయలు దిన్న యదియె
> మరులు గొన్నదియె మున్ మతి దప్పినదియె
> కనుగొన జెక్కిళ్ళ గడంతల గడవ
> నెనయ బూడిద మొత్తుకొని మేన బూయు
> దల నరం జెవుల జేతులను రుద్రాక్ష
> ములం బటికంబు పూసలును ధరించి

అయితే శివభక్తి మహిమ ద్వారా ఆమె తన నిశ్చల భక్తిని ప్రకటించుకుంటుంది. దీనిబట్టి చూస్తే సహజ పితృస్వామ్య సమాజమైనప్పటికీ, కొద్ది కొద్దిగా స్త్రీల గతుల్లో మార్పులు కనబడుతున్నా యనిపిస్తుంది. దీనికి కారణం వీర శైవ సిద్ధాంతాలే అని నిర్ణయించవచ్చునేమో.

పై విషయాలే కాక, సోమనాథుని కృతుల్లో స్త్రీల జీవనానికి సంబంధించిన ఇతర అంశాలెన్నో మనకి తేటతెల్లమౌతాయి. ఆ రోజుల్లో సమాజంలో క్రింది స్థాయి వర్గానికి చెందిన స్త్రీలు తమకుటుంబ ఆర్థిక అవసరాలకు తమ వంతు కృషి చేసేవారని తెలుస్తుంది. బోయస్త్రీలు పురవీధుల్లో పాలు, చల్ల అమ్మేవారు. దుగ్గలవ్వ అనే ఒక వ్యాపారి భార్య, తన భర్త ప్రతికి మారుగా బియ్యాన్ని ఇవ్వడంలో సహాయం చేస్తుంది. అలాగే కొద్దిమంది స్త్రీలు సంపన్న కుటుంబాలలో దాసీలుగా నియమితులయ్యే వారు. సాధారణంగా నీళ్ళు తెచ్చుట, వంటచేయుట, ఒకరి యింటి నుంచి మరొక యింటికి వార్తలు అంద చేయుట (సందేశాలు పంపుట) మొదలైనవి వీరి పనులలో ముఖ్యమైనవి. సంపన్న కుటుంబాల లోనే కాక, వేశ్యల యిండ్లలో కూడ దాసీలుగా స్త్రీలు నియమింపబడేవారు. ఒక వేశ్య యింటి దాసి, ఆమెను 'అక్కా' అని సంబోధించడమే కాక, ఆ వేశ్య యింటికి వచ్చిన జంగముని ద్వారా బసవని భార్య కట్టుకున్న చీరను తెప్పించమని సలహా ఇస్తుంది. దీనిని బట్టి యజమానురాలితో వారికి గల సన్నిహిత సంబంధము సులువుగా అర్థమవుతుంది. ముగ్ధ సంగయ్య' కథ ద్వారా వేశ్యల యిండ్లలో పెక్కు మంది దాసీలు ఉండేవారని తెలుస్తుంది. వీరందరూ ఒక్కొక్క విద్యలో ఒక్కొక్కరు ప్రవీణులు.

వేశ్యావృత్తి ఆనాడు సామాజికామోదం పొందిన వృత్తి. వేశ్యలకు సంఘంలో గౌరవప్రద మైన స్థానం ఉండేది. బసవన వేశ్యలను బ్రాహ్మణ మతము తోను, కులపతిని శైవమతము తోను

పోల్చడాన్ని బట్టి చూసే సంఘంలో ఈ వృత్తి ఎంతగా నాటుకుని ఉన్నదో తెలుస్తుంది.

'కులపతి యట్లు నిశ్చలయుక్తి భక్తి
వెలయాలి యట్టు ప్రేమమార్గంబు'

అనాటి ఇతర కవుల వలెనే సోమనాధుడు కూడా వేశ్యా వాటికల వర్ణన, వేశ్యల, విటుల ప్రవర్తన మరియు వేశ్యమాతల ధోరణులు మొదలగునవి స్పష్టంగా వివరించాడు. ముఖ్యంగా 'పండితారాధ్య చరిత్ర', పురాతన ప్రకరణములోని 'గురు భక్తాండారి' కథ ఆనాటి వేశ్యా వ్యవస్థకు ప్రతిరూపం అని నొక్కి చెప్పవచ్చు. ఈ కథ ద్వారా వేశ్యావాటికలు ప్రతిపట్టణం లేదా వ్యాపార కేంద్రాలలో ఉండేదని, ద్రాక్షారామము ఈ వృత్తికి ప్రసిద్ధిపొందిన స్థలమని తెలుస్తోంది. ఈకథలో సోమనాధుడు వేశ్యల మనోభావాలు, వారి ప్రవర్తన, రతికళా విశేషాలే కాక, ఈ వృత్తివల్ల ఎదురయ్యే ఇబ్బందులను కూడా కూలంకషంగా వివరించాడు "ఆ యింతులను గోరి బోయెడు దురాత్ములకు" కలిగే ఆర్థిక, ఆరోగ్య కరమైన సమస్యలు వివరించాడు వేశ్యాలోలత్వము తగదని వారించాడు. చివరగా వేశ్యావాటికలు'' ప్రత్యక్ష నరక కూపములని' నొక్కి చెప్పాడు.

మరొక ముఖ్య విషయ మేమంటే ఆనాడు సమాజ ఆమోదమే కాక వేశ్యావృత్తి మతపరమైన ఆమోదం కూడా పొందినట్లు అనిపిస్తుంది. ఎందువలనంటే, సోమనాధుడు శైవ భక్తులైన విటులను 'మిండ జంగములు అని వ్యవహరించాడు. సోమనాధుని రచనల ద్వారాను, మరి యితర ఆధారాల వలను మనకి ఆనాడు సంఘంలో దాదాపుగా పన్నెండువేల మంది (12000)మిండజంగములు ఉండేవారని తెలుస్తోంది. వీరందరినీ బసవన గౌరవించి, భక్తితో సేవించి వారికి కావలసిన సదుపాయాలన్నీ సమకూర్చేవాడు. వారిని వేశ్యల యిండ్లకు పంపిన సందర్భాలుకూడా ఉన్నాయి. ప్రసిద్ధ చరిత్రకారులు 'ఆర్ ఎన్.నంది' 'గారన్నట్లువీరశైవం దేవాలయ వ్యవస్థను, బ్రాహ్మణా ధిపత్యతను ధిక్కరించడం వలన ఎక్కువ సంఖ్యలో బ్రాహ్మణులు తమ అధికారాలను కోల్పోవడం జరిగింది. దీని ద్వారా తన మత ప్రచారానికి అవరోధం కలుగకుండా బసవన వారందరికి శివదీక్ష యిప్పించి వారి కోరికలు తీర్చే ఏర్పాట్లు చేయడం జరిగింది. ఒక సందర్భంలో తన భార్య కట్టుకున్న చీరను కూడా బసవేశ్వరుడు మిండజంగమునికి ఇవ్వడం జరుగుతుంది.

సోమనాధుని రచనలలో పలురకాలైన వేశ్యలు అగుపిస్తారు కొంతమంది శైవ మతాభినివేశం కలవారై, జంగమారాధన తమ కర్తవ్యంగా భావిస్తారు జంగములల శిష్యులను తమ పుత్రులుగా ఆదరిస్తారు. మరికొంతమంది విటుల వద్దనుంచి ధనమును 'రోయి' గా పుచ్చుకుని, ఆ ధనమున్నంత కాలము అతని సేవకే ఉపయోగపడేవారు. పండితారాధ్య చరిత్రలోని 'గురు భక్తాండారి' కథ ద్వారా ఒక వాడలోని వేశ్యను వంతులవారీగా (ఆవాడలోని పురుషులు)అనుభవించే (పోషించే) విధానం కూడా అమలులో ఉండేదని తెలుస్తోంది. దీనినే 'వాడపొత్తు' అని వ్యవహరించడం జరిగింది.

బానిసవృత్తి కూడా ఆకాలంలో సంఘంలో ప్రబలంగా ఉండేదని తెలుస్తోంది. దీనినే 'వెట్టి' అని కూడా అంటారు. ఒక కుటుంబంలోని పురుషుడు బానిస అవుతే అతని భార్య, పిల్లలు కూడా చేయవలసివస్తుంది. స్త్రీలు కూడా తమకుటుంబ ఆర్థిక అవసరాలకు వెట్టి చేసేవారు ఉదాహరణకు బసవపురాణం లోని 'పిట్టవ్వ' కథ అలాగే పండితా

రాధ్య చరిత్రలోని 'యిలుపట్టు గొంతి' అనే పదం కూడా ఈ విషయాన్ని బలపరుస్తోంది.

ఈ విషయాలే కాక సోమనాథుని రచనలలో స్త్రీల వస్త్ర, ఆభరణాది వర్ణనలుకూడా కనిపిస్తాయి. సోమనాథుడు సమాజం లోని వివిధ వర్గాలకు చెందిన స్త్రీల వస్త్ర, ఆభరణధారణ గురించి ఆయా సందర్భాలలో స్పష్టంగా తెలియచెప్పాడు. దీనిని బట్టి సమాజంలోని వివిధ తరగతుల మధ్య ఆర్థిక తారతమ్యాలు సులువుగా గోచరమౌతాయి. ఉదాహరణకు పండితారాధ్య చరిత్ర లోని సామవేది కథ లోని చండాల స్త్రీ వర్ణన. 'పటికి వెండ్రుకలు, గొఱుగుఁ బాపటయు వడ్డంపు ముక్కర, దొడ్డు గఱ్ఱల చీర, (ఆమె) నల్లని రంగు, కాళ్ళ కుండే కంచు మట్టియలు, (చేతులకు) నల్ల గాజులు, తగరపు కడియములు, పచ్చ గాజు పూసలు. శంకపు పూసలు, నల్లపూసల నవ్వసరము' ఆమె ఆర్థిక స్థితిగతులను చెప్పకనే చెప్పుతున్నాయి.

అదే విధంగా పర్వత ప్రకరణంలోని అటవిక స్త్రీల వర్ణన కూడా అదే పంథాలోనే సాగుతుంది.

'జుక్కలు బొట్లును జుక్కి వెండ్రుకలుఁ
జక్కని పాపటల్ జంగాళములును
నినుప నేవళములు నిత్తడి నరిగె
లును, వెండ్రుక దండలును, దగరంబు

పిల్లాండ్లు మట్టెలుఁ, బెకు వన్నియల
తొల్లుకుప్పసములు, నల్లగాజులును,
గలయంగ జెవుల సంకంబు పూసలును'

వారి భర్తల వృత్తి యాచక వృత్తి అయితే, పట్టణాలలో, దొరికే వస్తువులను సేకరించి పట్టణాలలో, గ్రామాలలో అమ్మడం చేసేవారు ముఖ్యంగా లేళ్ళ, దుప్పుల, నెమళ్ళ చర్మాలు, నవరాలు మొదలైనవి తీసుకుని వచ్చి గ్రామాలలో అమ్మతారు. వీరు బహుశా శ్రీశైలంలో శివరాత్రి ఉత్సవాల సందర్భంగా జరిగే తిరునాళ్ళలో తమ వ్యాపారాన్ని కొనసాగించే వారేమో.

దీనికి విరుద్ధంగా పుణ్యాంగనలు (సంపన్న కుటుంబాలకు చెందిన లేదా పట్టణాలలోని స్త్రీలు) వలుచని కుప్పసములు ధరించి, మెడలో మంగళ సూత్రమును ధరించేవారు, కాలి మెట్టియలు, పాటి తొడవు మొదలైనవి వీరి ఇతర ఆభరణాదులు వీరు సాధారణంగా ధరించే చీరలలోని రకములు సోమనాథుడు వివరంగా బసవ పురాణంలో చెప్పాడు. వీరికి తాంబూల సేవనము దైనందిన కార్యక్రమాలలో ఒక ముఖ్యభాగము. వారు తమ వెంట 'తాంబూల పేటికలలో రాజహంసల' మాదిరి శ్రీశైల పర్వత దర్శనానికి తరలి వెడుతున్నారట

వీరశైవ మతోద్యమం దేవాలయ వ్యవస్థను ధిక్కరించినట్లు చెప్పుకున్నా, ఆంధ్రదేశంలో దేవాలయ వ్యవస్థ అభివృద్ధి యధావిధిగానే జరిగింది. సోమనాథునిరచనలలో శైవ దేవాలయాల ప్రసక్తి మనకు ఎన్నో సందర్భాలలో కనిపిస్తూనే ఉంటుంది. శాసనాధారాల వలనకూడా శైవ దేవాలయాల నిర్మాణం కాకతీయుల కాలంలో ద్విగుణీకృతమైనట్లు తెలుస్తోంది. దేవాలయాల నిర్మాణంతో పాటుగా దేవదాసీ వ్యవస్థ కూడా ఆనాటి సమాజ వ్యవస్థలలో ఒక విభాగం. వీరు దేవగణి కలనీ వ్యవహరింపబడేవారు. ఇటువంటి కన్యలకు ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే నృత్యగాన సంగీత విద్యలలో పూర్తి శిక్షణ ఇవ్వడం ప్రారం

భించబడుతుంది. శిక్షణ పూర్తి అయ్యాక పరీక్షలో నెగ్గితే జీవితాంతం అవివాహితలుగా దేవాలయాలలో కైంకర్యం చేసేవారు. పరీక్షలో నెగ్గలేకపోయిన వారు సాధారణ వేశ్యావృత్తిని అవలంబించేవారు. పండితారాధ్య చరిత్రలో మహిమా ప్రకరణంలోని 'సుందరంచెన్నజన్మాది చరిత్ర కథనము' లోని 'కనకలత' అనే స్త్రీని దేవగణికగా సోమనాథుడు చిత్రించాడు.

## ముగింపు:

తరచి చూస్తే, సోమనాథుని రచనలలో వీరశైవభక్తి భావమే కాక ఆనాటి సహజ రూపురేఖలు కూడా స్పష్టంగా తెలుస్తున్నాయి. ముఖ్యంగా స్త్రీల చిత్రణ చాలా సహజంగా వాస్తవానికి దగ్గరగా జరిగిందనే చెప్పవచ్చును.

వీరశైవం స్త్రీలకు పూర్తి మతస్వేచ్ఛ నివ్వడంలో సఫలమైందనే చెప్పాలి. బసవపురాణం పండితారాధ్య చరిత్రలలోని వివిధ భక్తుల కథలు తమిళ, కన్నడిగులకు చెందినవైనా, ఆనాటి రాజకీయ పరిణామాల దృష్ట్యా ఒక రాజ్యంపై మరొక రాజ్యం యొక్క ప్రభావాలు ఉన్నట్లుగానే ధృవీకరించవచ్చును. పోరండ్ల అగ్రహారము, సూరసాని కథ తెలుగు కథే. సూరసానమ్మ అనే శైవభక్తురాలు మల్లికార్జున పండితునికి సమకాలికురాలు ఆమె పండితుని దర్శించడానికి కొద్దిమంది శైవ భక్తులతో వెళ్ళినట్లుగా నిదర్శనాలున్నాయి.

స్త్రీలు కూడా తమ కంఠాల నుత్తరించుకుని వీరభక్తి ప్రదర్శించారనడానికి శిల్ప ఆధారాలున్నాయి. స్త్రీలు, ముఖ్యంగా క్రింది స్థాయిలోని వారు తమ కుటుంబ అవసరాలకోసం పురుషులతో సమానంగా కృషి చేసేవారు. మనువు తరువాత మొదటిసారిగా ఆంధ్రదేశంలో స్త్రీలకు ఆస్తిహక్కు ఉందన్న గుర్తింపు సమాజంలో వచ్చినట్లే ధర్మశాస్త్ర కర్తలు కూడ ఈ విషయాన్ని అంగీకరించారు. స్త్రీల మతపరమైన స్వేచ్ఛ మరియు ఆర్థిక స్వాతంత్ర్యం (కొంతవరకూ) వారు దేవాలయాలకు, ధర్మకార్యాలకు, బ్రాహ్మణులకు మరియు మతసంస్థలకు (మఠములు) విరివిగా ఇచ్చిన దానాలను, శాసనాధారాలను బట్టి అంగీకరించవచ్చును.

వేశ్యావృత్తి సామాజిక ఆమోదం పొందినట్లుగానే న్యాయ పరిధిలోనికి కూడా తేబడింది. కొలవి శాసనము, విజ్ఞానేశ్వరములోని వేశ్యావృత్తికి కల్పించబడిన న్యాయపరమైన రక్షణ, క్రీడాభిరామములోని జారధర్మాసనం ప్రసక్తి ఈ విషయాన్ని తెలుపుతున్నాయి.

అయితే పితృస్వామిక వ్యవస్థ ప్రబలంగా ఉన్న ఆనాటి సమాజంలో స్త్రీలు పూర్తి స్వేచ్ఛ అనుభవించారని చెప్పలేము. బసవపురాణం లోనే పితృస్వామ్య వ్యవస్థకు మంచి నిదర్శనం. మాదాంబ పుత్ర సంతానం కావాలని వ్రతములు, నోములు ఆచరించటం, అప్పటికీ ఆమెకు నాగాంబిక అనే కూతురు ఉన్నట్లుగా, మరొక సందర్భంలో (బసవన ఇల్లు వదలి తీశ్ళేటప్పుడు) ఆమెను బసవేశ్వరుని సహోదరిగా వర్ణించడంలోనే తెలుస్తుంది. ఆమె రచించిన వచనాలు సోమనాథుని రచనలలో కనిపించవు. అలాగే అక్క మహాదేవి చరిత్రకు కూడా సోమనాథుడు ప్రాధాన్యత నివ్వలేదు. ఏది ఏమైనప్పటికీ, సోమనాథుని కాలానికి వీరశైవ మత ప్రభావం దృష్ట్యా సమాజంలో స్త్రీల స్థాయి కొంతవరకూ అయినా మెరుగైందనే చెప్పాలి.

# కాముని పండుగ

డాక్టర్ కె. రుక్నుద్దీన్

కవికుల గురువైన కాళిదాసు తన అభిజ్ఞాన శాకుంతలంలో 'ఉత్సవ ప్రియాః నరాః' అని సాధారణీకరించాడు. నరులు ఉత్సవ ప్రియులని దాని భావం. ఉత్సవాలు స్థాయిని, సందర్భాన్ని బట్టి వుంటాయి. అవి సాధారణ స్థాయిని మించి జరుపుకొనడమే ఉత్సవం. రోజూ తినే దానికంటే స్థాయిలో, వ్యయంలో మించినదే ఉత్సవం. నాడు తినాలి. రోజూ ధరించే దానికంటే మించిన దానిని ధరించాలి. రోజూ విశ్రమించిన దానికంటె మించి ఉత్సవం నాడు విశ్రాంతి తీసికోవాలి.

సమాజంలోని రకరకాల మానవులందరకూ పండగ ఒకటేకాదు; తాను మునిగిందే గంగ అన్నట్లు తాను మెచ్చిన స్థాయిలో ఉత్తమోత్తమమయిందే పండగనాడు తాననుభవించాలి.

నాగరక ఛాయలు మానవాళిపై ప్రసరించిన తర్వాత, ఈ పండగలు, ఉత్సవాలు పొడసూపినవి. అవి ఆర్థికపరమైనవి కొన్నయితే, పారమార్థికమైనవి కొన్ని. ఏడాది పొడుగు శ్రమించి, పగలనకా రేయనకా పడిన శ్రమకు ఫలితం ధాన్యరూపంలో ఇంటికి వచ్చినపుడు సంతసించిన రైతు, కనీసం ఆ రోజైనా విశ్రాంతిగా, తలంటుకొని, స్నానమాడి, పిల్లాపాపలతో కలిసి, ఇష్టమైన, వంటకాలు తినడం, తన వ్యవసాయానికి మూలమైన ఎద్దులను అలంకరించడం, మొదలైనవి మొదట ఉత్సవాలకు, పండగలకు ప్రారంభ ప్రేరకాలు. కాగా, నాటి సమాజంలో రైతు మూలస్తంభం కావడంవల్ల మిగతా వృత్తుల వారు సైతం రైతు ననుకరించడం సహజం. అలా ప్రారంభమైన పండగలు ధాన్యంపేరా, ధనంపేరా, గుట్టపేరా, పుట్టపేరా, చెట్టుపేరా, పుట్టినపేరా, చచ్చినపేరా, వ్యాపించి; కావలసినన్ని పండగలు పుట్టుకు వచ్చినవి. మంచివాడనుకున్నవాడు పుట్టినా, చెడ్డవాడు చచ్చినా, అనుకోవడం పరిపాటయింది. ఇట్లా నేటి ప్రపంచం, ప్రతిరోజూ, ఏదో ఒక పండగ జరుపుకుంటూనే వుంది.

భారతీయుల పురాణ సంబంధమైన పండగలలో కాముని పున్నమ ఒకటి. దీని వికృతరూపాలు ప్రపంచంలోని చాల దేశాలలో కనబడుతున్నాయి. ఇది పాశ్చాత్య దేశాలలో ఫైర్ ఫెస్టివల్స్ (*Fire Festivals*) కోవలోకి వస్తుంది.

శాలివాహన శక పంచాంగం ప్రకారం ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాడు కాముని పున్నమి జరుప

తెలుగు రీడర్, మహిళా విశ్వవిద్యాలయం, కోఠీ హైదరాబాదు–500 195.

బడుతుంది. కాముడు—మన్మథుడు. మన్మథుడు ఈ రోజు ఊహూతా కాల్చబడతాడు. శివుని మూడవ కంటి కార్చిచ్చురేగి, కాయజుడు మాడి బూడిద కట్టయైనదినమిది. ఈ ఉత్సవానికి మూలం మన కుమార సంభవ ఇతి వృత్తమే.

భౌతికంగా బలవంతులైన రాక్షసుల దురాగతాలు మితి మీరినవి. వారి నాయకుడు తారకుడు. వానికి యెదురు లేకుండాపోయింది. శివ పార్వతుల సంతానము మాత్రమే, దురాగతాలకు అనకట్ట వేయగలరు అనేది విధి. అలా "లేదు—చూలూలేదు. కొడుకు పేరు సోమలింగం"- అనే సామెత అపుడే పుట్టి వుంటుంది. శివుడు నిశ్చలుడాయె, పార్వతిపట్టు పడలదాయె, ఇక వారికి సంతానం కలగడమెలా? లోకం కష్టాలు గట్టెక్కడమెలా! నిశ్చలుడిని చంచలుడిగా జేసి, పార్వతిపై పరవశతను పొందిన వానిగా జేయమని సకల లోకాలూ మన్మథుని ప్రార్థేయ పడినవి. బహుజన హితాయ, బహుజన సుఖాయ, లోకకళ్యాణార్థమ్, కాముడీ పనికి పూనుకున్నాడు. కృతకృత్యుడైనాడు. తర్వాత శివుని మూడవ కంటి మంటల్లో మాడి బూడిదైనాడు. (తర్వాత మళ్ళీ బతికినాడు. అది వేరే సంగతి).

కాముని ఆత్మ త్యాగదినోత్సవమే కాముని పండగ. ఈ సంఘటన సాహిత్య వైవిధ్యాల లాగానే కాముని కథా చిత్రణలో సైతం, రకరకాలుగా మలుపు తిరిగింది, కాళిదాసు కుమార సంభవంలో 'సమధత్త బాణం' (3–66) అని, బాణం యెక్కుపెట్టినాడన్నాడు. నన్నెచోడుడు—తన ఆంధ్ర కుమార సంభవంలో 'కంతుడేయ దొడగె' (5–36) అని, మన్మథుడు బాణాలు తానే వేసినాడన్నాడు. ఇక జానపదుల సాహితీ సముద్రంలోనైతే మన్మథుడు ఓలలాడినాడు. తల్లికేసి గుప్పినాడు; తండ్రికేసి గుప్పినాడు.

బసువంత దెచ్చినాడె
ఓలీ
కెమ్మ కేలిల ఓలీ!
సిల్లుల్ల గల్పినాదె
ఓలీ
కెమ్మ కేలిల ఓలీ
తల్లికేసి గుప్పినాడె
ఓలీ—కెమ్మ కేలిల ఓలీ
వొర్సలేదు వాయి లేదు—ఓలీ॥
తండ్రికేసి గుప్పినాడె ఓలీ
కెమ్మ కేలిల ఓలీ
వొర్సలేదు వాయిలేదు ఓలీ

శివ పార్వతులు లోకాలకు తండ్రీ తల్లి; వారి పైకే మన్మథుడు తన అస్త్రాలు ప్రయోగించినాడు. ఇక్కడ వొర్సలేదు, వాయిలేదు. (వరుస-వాయి) 'తల్లికేసి గుప్పినాడు తండ్రికేసి గుప్పినాడు—అని జానపదులు కమ్మగా పాడుతూ వివరిస్తారు. 'కింశుకాది కుసుమరాగాంభసా' హోళి గడుపుకున్నారని కామ శాస్త్రంలో వివరించారు ఆ కింశుకమే ఇక్కడ 'బసువంత' అయింది.

తారకుడు బలవంతుడు. వాని దురాగతాల వల్ల సామాన్య జీవితానికి భంగం కలుగుతున్నది కూడూ గుడ్డా దొరకడం లేదు. ఈ దుర్మార్గుడు నశిస్తేనే తాము మళ్ళా సాధారణమైన బతుకు గడప గలుగుతారు. అందుకు జానపదులు తమ కాముని, అదే మన్మథుని ప్రార్థిస్తున్నారు. ప్రార్థేయ పడుతున్నారు పరిస్థితులను యేకరువు పెడుతున్నారు. వచ్చి చక్కదిద్దమంటున్నారు

జొన్నాగింజా బంగారమాయె
తోగుల్ జొంపుల్ జాటాకులాయె

ముద్దుకుంట రావోయి కామన్నా
నా ముత్యాల పందిరి కిందికి ॥

ప్రజల ప్రార్థన విన్న కాముడు వస్తాడా! వస్తే ఎట్లా వస్తాడు, ఒక్కడేనా!!

గూడు గూడే గున్నసింతా
దీగినాడే దొమ్మరోడూ–
దొమ్మరింటి దొడ్డ బిడ్డా
మా యింటి ఆడ బిడ్డా–
శిక్కు దీసీ కొప్పు వెట్టి
సిరి గంధం బొట్టు వెట్టి
యేడి కోతివ్ కామన్నా
మంచి నీల్లా బాయి కాడ్కి–
మల్లెలమ్మ తోట కాడ్కి–

లోకం కొరకు కాముడు కదలినాడు, శివుని ప్రేరేపించాలి. ఆనాటి దొమ్మరోడిలా అలంకరించుకున్నాడు. తోడుగా దొమ్మరింటి దొడ్డ బిడ్డ—రతి ఇద్దరే వచ్చారా; శుకపికాదులు, సమీర వసంతాదులు. గూడెంగూడెమే మంచి నీళ్లబాయి; మల్లెలమ్మ తోట; ఇదే పార్వతి తప మొనరిస్తున్న తోట।

కాముడు శివ పార్వతులపై పూల బాణాలు వేసినాడు. అదే వసంతాలాడినాడు. నిశ్చలుడైన శివుడు చంచలుడైనాడు. ఈ పరిణామాన్ని మనో నేత్రంతో గమనించాడు శివుడు. ఉగ్రుడైనాడు. మూడవ కన్ను తెరిచాడు; ఫలితం?

జోజెర జోజెర గాజుల పాపా
గాజుల్ గిజుల్ సన్నాయి పాపా
పాప పాపకే సందే దీపం
దీపందీసుక పల్లెకె పోతే
పల్లె కుక్కలన్ని బావ్వ మానే
అప్పుడే నాపై జల్లు మానే
జల్లు మన్నాకాన మల్లెలు రాలే

మల్లెల మాసయ తోట వెట్టే
తోట్ల వున్నాది గుబ్బాల బొడుసూ
గుబ్బాల బొడుసూకు గత్తాపు రెక్కె,
రెక్కె గాదూరో లావేణ దండూ
దండు గాదూరో దామెర మొగ్గా
మొగ్గ గాదూరో మోదూగునీడా
నీడ గాదూరో నిమ్మాల బాయీ
బాయి గాదూరో బచ్చాలి కూరా
కూర గాదూరో కుమ్మారి మేనూ
మేను గాదూరో మేదారిల్లూ
ఇల్లు గాదూరో ఈగేం తెట్టే
తెట్టె గాదూరో ముసలోని........

విచలితుడైన శివుడు ఆత్మ పరిశీలన చేసికొన్నాడు. యుగ యుగాలుగా లేని మానసిక వికారం, యిపుడెందుకు కలిగిందని, విచికిత్స చేసి తెలిసి కొన్నాడు. ఆగ్రహించి మన్మథుని దహించినాడు. అపుడే మన్మథుని పై (శరీరం) జల్లుమన్నది.

జల్లుమంటే అన్నది, మల్లెలు రాలనైతే రాలినవి. మల్లెలు రాలడం, శివుని మనసులో పార్వతి యెడల రాగోదయానికి ప్రతీక. గుబ్బాల బొడుసు— గుబ్బల పడచు శివునికి పార్వతి గుబ్బలవడుచుగా కనబడడమే లోక కళ్యాణానికి నాంది.

ఆనాటి సామాజిక స్థితిగతులను వివరించే గేయాలు, ఈ పండగ సందర్భాల్లో వినబడతాయి.

జోజెరడుగా బోతె జొనగింజ దొరికే
జొనగింజ పేరేం? మెంటేపి రాజు
మెంటేపి రాజును కొరన్నా
అప్పరెడ్డిపల్లె కొతిమిరన్నా
అయినయినెడ్లాన్ దెస్తీమిరన్నా
ఆర్సికొస్తే ఆర వైపుట్లూ

ఈర్నెకొత్తే ఇతవైపుట్లూ
అన్నిగూడ వోస్కునె గుగ్గిల్ల శెన్నయ్యో
గాసమియ్యామంటె పీసాల్దువుతడు,
మూలవాసం దీస్క ముడ్డిగగొత్తే
ముడ్డికి వట్టిం దడ్డెడు నూనే
అడ్డెడునూనెకు పైకం లేదు.
పైకంలేకుంటె పయ్యోదాన్నమ్ము,
పయ్యోదాన్నమ్మితె ఖండికి లేదు
ఖండికిలేకుంటె మొండిదాన్నమ్ము
మొండిదాన్నమ్మితే మోటకులేదు.
మోటకు లేకుతుంటె హోల్నమ్ము
హోల్నమ్మితె అర్కకు లేదు
అర్కకులేకుంటె కోడ్నమ్ము
కోడ్నమ్ముతె గుడ్డుకు లేదు—గుడ్డుకులేకుంటె
గుడ్డుక సావు .. ...

.... ....

దేశంలోని కరువూ షావుకార్ల దురాగతాలు, పరిణామాలు వివరంగా పై గేయంలో తెలుపబడినాయి.

కాముని పున్నమ సందర్భంగా పాడే చాల పాటల్లో 'శెమ్మకేలిల ఓలీ'—అనే పూతపదం వుంటుంది. 'శ్యాం ఖేలేరే హోళీ'—అనే హిందీ వాక్యానికి యిది వికృతరూపం కావచ్చునని విమర్శకులంటున్నారు.

కాముని పున్నమకు సుమారు వారం రోజుల ముందు రాత్రుల్లో అమ్మాయిలూ, అబ్బాయిలూ వేరువేరుగా గుంపులుగుంపులుగా తయారై ఇల్లిల్లూ తిరిగి జోజెర ఆడుగుతారు.

మగపిల్లలు ఒకపిల్లవానికి ఎలుగుబంటి వేషం వేస్తారు. శరీరానికంతటికీ నల్లని గోనె బొంతలు చుడతారు పాతచేటను వంచి వాని తలకు కట్టి పొదుగ్గా, ఎలుగుబంటి మూతిలాగా వచ్చేట్లు చూస్తారు. ఎలుగుబంటి వేషం మెదకు తాడు, లేక పగ్గం బిగించి, ఆ గుంపులో బలంగా వున్నవాడు తాడు చేతిలో పట్టుకుని కనబడతాడు. ఎలుగుబంటి అక్కడి వారిని కరువబోయినట్లు పిల్లవాడు దానిని అదుపు జేసినట్లు నటిస్తారు. అందరి చేతుల్లో నిలువెత్తు కర్రలుంటాయి. వానిని నేలకు ఆయగా పొడుస్తూ పాడుతూ వుంటారు.

జోజెర జోజెర గాజుల పాపా
గాజుల్ గిజుల్ సన్నాయి సాపా...

మొదలైన గేయాల్ని—ఆ గుంపు నాయకుడు చెబుతూ వుంటే, మిగతా వారంతా పాడుతూ వుంటారు. ఎలుగుబంటి అడ్డంగా వూగుతూ పాట కనుగుణంగా ఆడుతూ వుంటుంది.

ఎలుగుబంటిని వారు పట్టి ఆడించడం, ఆనాటి పరిస్థితులను వారధిగమించినారనడానికి ప్రతీక కావచ్చు

ఆడపిల్లల గుంపు వేరుగా వస్తుంది. ఓ చిన్న పటువ (కుండ)కు చుట్టూ సన్నని రంధ్రాలు చేసి, దాంట్లో ఓ దీపం వెలిగించి పీద మూత వుంచి, ఓ అమ్మాయి తలమీద చుట్టబట్ట పెట్టి ఈ కుండను ఆమె తలకెత్తుతారు. కారుచీకట్ల నడుమ పటువ సన్నని రంధ్రాల నుంచి బయటకు ప్రసరించే దీపపు కాంతులు—ఆకాశమూ చుక్కల్లాగా కనబడుతుంది.

అమ్మాయిలు—
నున్నాటి బండమీన—కామక్కాతయ్యాలో
నూగులెండబోసీ—
ఎన్నెన్ని నూగులన్ని—గంపలకెత్తి
గంపలనూగులన్ని—గాన్గవోసీ
ఎక్కెక్కి తొక్కంగ—ఎల్లెనమ్మనూనే
నూనెమ్మనూనే—నున్నువదనూనే—
నూనెట్ల వాకో—నెత్తిబిల్లదొరికే—
నెత్తి బిల్లవెట్టుక నెల్లూరి కోతి
నెల్లూరి లమిడి కొడుకు శెల్లకొంగు వట్టే

పట్టికులమిడికొడుకు భావ్యం కాదూ
ముట్టాకు లమిడి కొడుకు మురిపెంకాదూ...

అని పాడుతూ ఇల్లిల్లూతిరుగుతూ జోజెర ఆడుగుతా.

కామదహనం నాటి సాయంకాలం జనం ఇంటింటికీ తిరిగి, కట్టెలూ నుగ్గులూ పోగుచేస్తారు. అట్లా పోగయిన వాటినన్నిటినీ గ్రామంలోని నాలుగు తోవల కూడలిలోనో, దేవాలయం దగ్గరో దావడి సమీపంలోనో పేర్చి, గ్రామపెద్దలందరినీ సమావేశపరచి, వారి సమక్షంలో కట్టెల పోగుకు, అంటే అదే కాముని చితికి చితికి నిప్పంటిస్తారు. గ్రామంలోని వారందరూ ఆ చితిలో తమ యింటినుండి విధిగా కనీసం ఒక కట్టెనో ఒక పిడకనో తెచ్చి వేయడానికి యత్నిస్తారు. అలా చేయడంవల్ల సంవత్సరమంతా వారికి సుఖాలు కలుగుతాయని విశ్వాసం

ఈ కామ దహనానికి యువకులు కొంతమంది వేరే వారి దొడ్లనుండి, ఇండ్లనుండి కట్టెలు, నుగ్గులు దొంగతనంగా తెచ్చి మంటలో వేస్తారు. ఆరోజు అట్లాంటి నేరాలన్నీ మాఫ్. అంతగా పట్టించుకోరు. సవ్వుకుంటారు. తమకే మేలు కలుగుతుందనుకుంటారు.

కాముని చితి కాలింతర్వాత, మరుసటిరోజు ఉదయాన్నే, గ్రామపెద్దలందరూ వచ్చి ఆ బూడిదను గ్రామంలోని ఇంటింటికీ పంచుతారు. ఇండ్లలోని పెద్ద మనుషులు, ముఖ్యంగా నానమ్మ అమ్మమ్మలు ఆ బూడిదను భద్ర పరిచి, ఇంట్లోని వారి కెవరికైనా, యెప్పుడైనా 'గాద' (చర్మ వ్యాధి, స్కిన్ ఎలర్జీ) వస్తే, ఈ బూడిదను ఔషధంగా పూస్తారు, నీళ్లలో కలపి తాపుతారు. పైత్య ప్రకోపం వల్ల కలిగే యీ 'గాద' కాముని చితి భస్మాన్ని వాడడం వల్ల తగ్గుతుందని విశ్వాసం.

ఈ సందర్భంగా యువతీ యువకులు ఒకరిపై మరొకరు రంగులు చిమ్ము కోవడం, బురద పూసుకోవడమూ జరుగుతుంది. ఈ పండగ రోజుల్లో ఇటు వంటి రంగులూ, బురదల వల్ల అనవగాహనలూ, దురవగాహనలూ కలుగవు. అంతా పండగ సందర్భంలో సంతోష క్రియగానే స్వీకరిస్తారు.

కాముని పండగ సందర్భాల్లో బురద చల్లుకోవడం ఒక రకంగా 'కర్దమ ప్రసాధన క్రియ' యని కొందరి అభిప్రాయం. ప్రకృతి చికిత్స విధానంలో మృత్తికా విధానం ఒక ప్రక్రియ. చెప్పబడింది. మెత్తని ఒండు మట్టిని శరీరానికి పట్టించి కొంత సేపు సూర్య రశ్మిలో ఆరనిచ్చి, తర్వాత శరీర మర్దనం కావించు కొని స్నానం చేస్తే, చర్మ వ్యాధులు రాక పోవడమే కాదు, మానసిక తాపాలూ దూరమౌతాయని విశ్వాసం.

నేటి కాముని పండగ బురద చల్లుకోవడాలు విపరీతమైన వికృత రూపాలు దాల్చి, పేడ, తారు, సునేరు, మరెన్నో మురికి పదార్థాలు పూసుకునే వరకు దిగజారింది, కాళ్ళు చేతులు బిగించి మురుగు కాలువల్లో ముంచే వరకు మనం చూస్తూనే వున్నాం, ఇది కాల వైపరీత్యం.

ఉత్తర భారత దేశంలోని కొన్ని ప్రాంతాల్లో కాముని పండగను హోళికోత్సవంగా జరుపుకుంటారు. శిశువులను చంపి తినే ఒక రాక్షసి పేరు హోళికా దానిని ఫాల్గుణ పూర్ణినాడు చంపి తమ శిశువులకు ఆపద రాకుండా చూసుకుంటారు. అందువల్ల అది హోళికోత్సవముయిందని ఉత్తర భాగతంలో ఒక ఐతిహ్యం.

ప్రతి వర్షం, కుతుకాగతులై వసంతోత్సవాలు జరుపుకొనే వారిని వర్ణించిన ప్రబంధ సాహిత్యాలూ మనకున్నాయి.

ఏది ఏమైనా కాముని పున్నమ ఆంధ్ర దేశంలో, ఒక జానపదుల పండగ. చిన్నా పెద్దా, బీద ధనిక, భేదాలు లేకుండా అందరూ పాల్గొని జరుపుకొనే పండగ. ప్రకృతితో, పురాణ సంబంధి సంఘటనలతో సంబంధమున్న పండగ. అధిక జనాదరణ పొందిన జానపదుల పండగ.

# కవితావీధి

## రెండవ బాల్యం

డి. ఏ. ఎల్. యన్. మూర్తి

తలపన్ రాదు మనుష్య జీవితపు వృద్ధాప్యంబు శాపంబు గా
ఇలపై అర్వది యేండ్ల స్వానుభవ మందెన్నెన్నియో తీపి గు
ర్తులు, కష్టాల పరంపరల్ గడిపి యెంతో జ్ఞాన మార్జించి ని
శ్చల చిత్తంబున తా మెలంగును సమాజ శ్రీలు కాంక్షించుచున్।

అన్నెము పున్నెం బెరుగని
చిన్నారులు దరికిజేరి చిరునవ్వులతో
చిన్నతనంబును గుర్తుకు
గ్రన్నన తెచ్చెదరు జ్ఞాపకంబుల నెన్నో

స్వేచ్ఛగా తన కతి ప్రియమైన కళలందు
నిష్ణాతు డవగ యత్నించ వచ్చు
అనుభవంబుల నేర్చినట్టి విజ్ఞానంబు
పరులకు వినియోగ పరచ వచ్చు
అతి అమాయక ప్రజ కక్షర జ్ఞానంబు
కలిగించి సేవలు సలుప వచ్చు
కులమత ద్వేషాల కుములువారల మదిన్
స్నేహ సంజీవిని చిలుక వచ్చు

భావి భారత పౌరులౌ బాలురకును
మనదు సంస్కృతి విలువలు మదిని నిలిపి
దేశ భక్తులుగా తీర్చి దిద్ద వచ్చు
పరుల సేవకు చక్కని తరుణ మిదియె

వయసు అనుభవాలకు గౌరవంబు జూపి
పిన్న పెద్దలు మిగుల సంప్రీతి మెలగ
సాన బట్టిన రత్నంబు చందమునను
భాసిలు ముదిమి రెండవ బాల్యమటుల.

8–145/1, వసంతపురి కాలనీ, మల్కాజిగిరి, హైదరాబాదు–500 047.

# ఆ రెండు కళ్ళు

—చిటిప్రోలు వేంకటరత్నం

రెండు మనోజ్ఞ తేజ స్వముద్రాలు
రెండు సౌందర్య విశ్వవిద్యాలయాలు
రెండు అపూర్వ మంత్ర శక్తి మహాపట్టణాలు
రెండు అనిర్వాచ్య మనుజాద్భుత ప్రపంచాలు
రెండు నారీ నర ప్రణయ యోచనా గవాక్షాలు
రెండు అసాధ్య క్లిష్ట సమస్యలు
రెండు అద్వైత తత్వాద్భుత ప్రజ్వల న్మహిమండలాలు
రెండు కళ్ళు
ఆ రెండు కళ్ళు

14-64/1. గీతామందిర్ ఎదురుగా, లక్ష్మీటాకీస్ రోడ్, మిర్యాలగూడ.

# దీపం

— కనపర్తి రామచంద్రాచార్యులు

దీపం వెల్గడమంటే– మాటలా?
వత్తి చిత్తైపోతుంది.
అగ్గిపుల్ల
భగ్గున మండి మసైపోతుంది.
వత్తికీ, పుల్లకూ మధ్య–
ఎంత 'స్నేహం' ఆవిరైపోతుంది!
దీపం వెల్గడమంటే మాటలా మరి?
వెల్గించిన అగ్గిపుల్లది
ఎంత త్యాగం?
వెల్గిన దీపాన్ని చూడకనే
కన్నుమూస్తుంది।
వెల్గడాని కుపకరించే
తైలానిది ఎంత 'రస' జీవనం?
మౌనంగా 'లోలోవలే' మరిగి
కరిగిపోతుంది!
ఇక-వెల్గే వత్తిది
ఇంకెంత నిస్వార్ధగుణం?

క్షణక్షణం 'గుండెమంటల్లో'
నిలువునా కాలిపోతుంది,
అందుకే–'దీపం జ్యోతి పరబ్రహ్మ'!
దానికి జాతిభేదం లేదు–
ఎవరు వెల్గించినా వెల్గుతుంది,
ఎవరికైనా 'వెల్గుబాట' చూపుతుంది.
ఒక్కటి వెల్గితే చాలు–
ఒక్కసారి వెల్గితే చాలు–
తనలాంటి కోటిదీపాలకు
జీవం పోస్తుంది!
'ఉఫ్' అంటే ఆరిపోయే బ్రతుకే అయినా,
ఊపిరాడేంత వరకు–
కాంతి కేతన మెగరేస్తుంది!
చీకటి వీపుపై
వెలుతురు కొరడాలు ఝళిపిస్తుంది!
'గురువు' అన్న శబ్దార్థం–
దీపానికే సార్థకం:

పాతగంజువీధి సిద్దిపేట–502 103.

కన్నడ కవిత

# అమ్మా, ఆచారమూ, నేనూ

కన్నడ మూలము :

కె.ఎస్. నిసార్ అహమద్

తెలుగు సేత :

శంకరగంటి రంగాచార్యులు

నా పెళ్ళికి ముందు
నానా విధాల కన్యల్ని చూసి మా అమ్మ
ఒక్కొక్కర్నీ తన పరిశీలన అనే గీటురాయికి
రాచి,—

అది పొంగ, ఇది కాకి,
దానికున్న మేలు బోకి
అది అన్నిట్లోనూ సరే అయినా నాలిక పొడవు,
ఒకతి లంఖిణి,
మరొకతి జిరాఫిణి.
ఒకతి నిలబడితే దిష్టిబొమ్మకరణి,
మరొకతె పళ్ళ పిల్లవాళ్ళ వాతసరణి—
అంటూ అందరికీ బిరుదు ప్రదానం చేసింది.

చాలా రోజులు అవివాహితుడుగానే
వున్నాను;
అమ్మను మనసారా శపించాను:

అమ్మ సంప్రదాయనిష్ఠురాలు,
తప్పనిసరి ఆమెకు ఖురాను, నమాజు, రంజాను
ఉపవాసాలు
ధార్మికాచారాల్లో చెప్పతీరని ఆస్థ.
బురఖా తగిలించుకోక వీథిలో పోతున్న
మనవాళ్ళ

ఆడపిల్లల్ని చూసి భగ్గున అగ్గై—
ఎక్కువ చదువుతున్న విధిరాణుల తలరాతే ఇంత
దేవుడూ, ధర్మాల భయంలేదు కాసంత
మగవాళ్ళ ముందు తనువు ప్రదర్శనం చేసే
మగరాయుళ్ళు మొగుళ్ళతో వుంటారా?
ఇలాంటివాళ్లని నాకొడుక్కెప్పుడూ తేను.
అని ప్రతిజ్ఞ చేసి—

సదా బురఖా తగిలించుకునివుండే
ఎలుగ్గొడ్డుని,
ఆధునికాభివృద్ధులు తెలియని గుడ్డిని
పల్లెమొద్దు కాచ్చిప్పని మెచ్చి
నన్నడిగినపుడు,
నేను అదిరిపడి
స్వయంగా చూసిన విద్యావంతురాలిని
పాణిగ్రహణం చేస్తా నన్నపుడు—
చదివినోళ్ళు పాడుగానూ.
నేనేం చదివినా, మొద్దూ!
పెళ్ళికి ముందు పిల్లవాడు
పిల్లను చూడటం ధర్మవిరుద్ధం.

మేమందరమూ కళ్ళుమూసుకుని, పిల్లనిమెచ్చి,
ముడేస్తామూ!

అంటూ నోరు మూయించింది
తనమీద నాజుగుప్సను రెట్టింపుగా చేసింది.

నాన్న ఉదారుడు
"కొడుకు, తనే ఎన్నుకోనీ ముందుదారి,
కన్నవాళ్ళం మనమెందుకు కావాలి
అడ్డంకి.
ఆ ఆలోచనకు స్వస్తి చెప్పు ఇంక."
అంటూ హెచ్చరించినపుడు—
అమ్మ అన్నపానాలు వదలి, గోడుగోడు
మని యేడ్చి,
ఉరి, బావి, అగ్గి—ఉచ్చరించినపుడు
ఊరకయ్యాను.

నాన్న లోకం చూసినవాడు.
అలానే—అమ్మ రోషాన్నీ, మొండిపట్టునీ
చూసినవాడు.
క్లిష్టపరిస్థితికి వచ్చిన తగాదాను తలంచి,
స్పష్టంగా ఏమీతోచక, 'నీఇష్టం' అన్నాడు.
రాత్రంతా గదిలో దీపం వెలిగించి, సిగరెట్లు
దహించి,
చరచర తిరుగుతూ లోలోపల బాధపడ్డాడు.

ఒకరోజు అమ్మకు జ్ఞానోదయమైందని
పించింది.
భోజనానికి కూర్చున్నపుడిక—
నీ ఇష్టప్రకారమే, చదివినదాన్నే
పెళ్ళాడరా. నాన్నా'
అన్నపుడు,—
అపనమ్మకంతో కూడిన,
ఆశ్చర్యంతో కూడిన.
ఆనందంతో కూడిన.
భయం పెరిగి,
చేయి కడుక్కొని లేచాను వేగ

ఆ పట్టాద్వయం ధరించిన భామ భావచిత్రం
రోజంతా తదేక దృష్టితో
ఆచి, తూచి,
చిరునామాను తెలుసుకుని, దరికేగి చూసి మెచ్చి,
నిశ్చితార్థం, శాస్త్రం, వివాహం—అన్నీ ముగిశాయి
మనస్సు అమ్మకు మౌనంగా నమస్కరించింది.

మొదటిసారి షికారుకు వెళ్ళేటప్పుడు
నాభార్య చేతులులేని రైక తొడుక్కొని,
భారీ చీరని నడుం కిందికి నాజూకుగా
కట్టుకుని,
మెడ బంగారు గొలుసూ,
కాళ్ళకు ఎత్తుమడమల చెప్పులూ,

చెవులకూ, వేళ్లకూ ఉంగరాలు ధరించి,
లిప్‌స్టికూ, పౌడరూ లెస్సగా పూసుకుని,
దృష్టి, బొట్టుపెట్టుకుని,
జడ గోపురంలో కురుల్ని బిగించి
ఎడమపాపట తీసి,
వీటన్నిటినీ మించిన చిరునవ్వుముఖాన చిందచేసి
గడపను దాటే సమయంలో—
"వస్తి, తట్టుకోండి"—అంటూ లోనికి పరుగెత్తి,
వచ్చి! 'పదండి' అన్నప్పుడు.
తల తిరిగి!నాలుక పిడుచకట్టి, నేను మూగవాడి
నయ్యాను

చూస్తే—
తగిలించుకుని వుంది మాఅమ్మ బురఖా

# దీపం వెలగని చోటు

అడిగోపుల వెంకటరత్నం

వసారా మూల వొదిగిన నాగలి
గడచిన వైభవం తలచి చింతిస్తూ
వంటచెరుకు రూపం ఎత్తబోతుంది!
సస్యవిప్లవకారక పరికరాలు
అవయవాల్ని సెప్టిక్ చేసుకుని
అటకమీద అవసానదశ గడుపుతున్నాయి!
రెక్కలు రాల్చుకున్న తాటాకుకప్పు
ఆకాశాన్ని నట్టింట్లో అవిష్కరిస్తున్నది!
ఉదయాల్ని నిద్రలేపి
పాతాళగంగకు యాతం ఎత్తి
అస్తమయాల్ని వెలిగించి
మంచె ఎక్కిన నిరంతర శ్రామికుడు
ఆ మానవుడు
నేడు....
అవిష్కరించిన ఆకాశపందిరికింద
వృద్ధావస్థ సామ్రాజ్యంలో
రుగ్మతల రారాజు!

మూడుకోళ్ళపై నిలబడ్డమంచం
కృతజ్ఞత చాటుతూ మోస్తుంటే
దాడి చేసిన చలి
నిస్సహాయుడైన అతడి చేతిలో
నిస్సిగ్గుగా ఓడిపోతుంది!
చంద్రుడు నక్షత్రాలు
తండ్రీ కొడుకులై
దోబూచులాడ్డం చూసి
శ్రమ వుప్పెనలోమునిగి చనిపోయిన భార్య
చిటికెన వేలుబట్టి నడుస్తూ
మేడిపట్టకుండానే
కాలం చేసిన కొడుకు గుర్తొచ్చి
జ్ఞాపకాల వెల్లువలో కొట్టుకుపోయి
దారిలేని వొడ్డున చేరి
అతడు దార్లు వెతుకుతుంటాడు!
చుట్టుముట్టిన చీకటి పరాజయం పొంది
వెలుగు కళ్ళాపిచల్లి తిరుగుప్రయాణం కడుతుంది!

నాగార్జున యూనివర్సిటీ, గుంటూరు–222 510.

# మందార మాల

## తెలుగు నవలా సాహిత్యములో "బుచ్చిబాబు"

కాద కిరణ్ కుమార్

తెలుగు కథకు ప్రపంచ సాహిత్యంలో సైతం స్థానం ఉంది. పాలగుమ్మి పద్మరాజుగారి "గాలివాన కథ ఇందుకో ఉదాహరణ. ఈ ప్రక్రియ ఆధారంగానే ఎందరో ఖ్యాతి పొందిరి. అటువంటి వారిలో బుచ్చిబాబు అగ్రగణ్యుడు అనడంలో అతిశయోక్తి కాదు. బుచ్చిబాబు మేధావి వర్గపు రచయిత" అని సాహితీ రంగంలో ఒక అపవాదు ఉంది. కాని ఇతని కథలు అన్ని వర్గాల వారి గుండెలను తట్టి ఆర్తిని నింపుతాయి. తనదైన శైలితో వాస్తవిక జీవి[illegible] ప్రతిబింబింప చేస్తూ కథలల్లిన మహా రచయిత బుచ్చిబాబు.

బుచ్చిబాబు కథలు అద్భుతమైన కథా చిత్రాలు పాత్రల మనస్తత్వ చిత్రణకు అద్భుతమైన కథనం జోడిస్తూ రచన చేయడం, పాత్రల్లోని ప్రాథమిక లక్షణాన్ని మాత్రమే గ్రహించి దానికి వాస్తవికతను జోడించి రచనలు చేయడంలో నేర్పరి. సృష్టి ఆరంభం నుండి నిర్విరామంగా సాగుతున్న మానవ అసంతృప్తి తుది మొదళ్ల ముడి విప్పే ప్రయత్నంలో నిరంతరం అన్వేషణ సాగించే జిగీషపు రచయిత బుచ్చిబాబు.

వివాహ వ్యవస్థ గురించి బుచ్చిబాబు తన ప్రతి రచనలోను వివరిస్తారు. ఎందుకంటే వివాహమనేది పవిత్రమైనది కనుక ఇది సృష్టిలో ఏ ప్రాణికి లేని విధముగా మానవ జాతికి ఒక అపూర్వమైన వరం. అటువంటి వివాహ వ్యవస్థ ఈనాడు కలుషితమై పవిత్రతను కోల్పోయి మిగిలిన వాటివలె తయారైనది. అనే ధోరణిలో 'ముగింపు మీకు తెలుసు' కథను రచించారు. వివాహం, సంసారం జీవితం ముగింపు ఈ సమరంలో శ్రమలు మాత్రమే చివరకు మిగులుతాయని చెబుతూ ఆకలి అనే జబ్బుతో ఆ శరీరాలు నిశ్శబ్దంగా ఏడ్చాయి. మంట చల్లారింది. తెల్లవారింది. వెలుగు· నిబ్బరం, కొత్తబలం, సంతృప్తి చెందిన శరీరపు వికాసం— ఇవన్నీ వివాహం అనే సంస్థలో అంత మొందాయి. జ్ఞాపకం మాత్రం మిగిలిపోయింది చివర వరకూ అదే స్మరించుకుంటూ అదే నిజమనుకొని భ్రమలో జీవయాత్ర సాగుతుంది.' అంటాడు. వాస్తవిక సన్నివేశాలను భావగర్భితంగా చెప్పడంలో బుచ్చిబాబు అగ్రగణ్యుడు. ఇదే కథలో స్త్రీ మనస్తత్వాన్ని తెలియజేస్తూ, మంచి వారు స్త్రీని ఆకర్షించలేరేమో!

మంచి వారు తన కోసం చేసిన త్యాగాన్ని స్త్రీ క్షమించదేమో!! మరో కథ 'కాలం ఆగిపోయింది'లో స్త్రీలముందు అనకూడదు గానీ, పురుషుణ్ని ఘన కార్యాలకు ప్రేరేపించేది స్త్రీలే. ఆ స్త్రీలే ఘన కార్యం సాధించనీయకుండా ఆటంకి పరుస్తారు అని స్త్రీ పట్ల బుచ్చిబాబు లోకంలో గల స్త్రీ మనస్తత్వము రచన ఎట్లా ఉందో తన లలో నిరూపిస్తారు.

బుచ్చిబాబు రచించిన రచనల్లో వ్యంగ్యాత్మక కథ 'కలం పట్టిన ఖరాల సంఘం'. నేటి రచయిత(త్రు)లు తప్పకుండా చదవవలసినకథ. ఇందులో నేడు సాహిత్యంలో వస్తున్న సెక్స్, హింస, డిటెక్టివ్, వంటి కథల పై అనేకమైన చురకలు మనకు కనిపిస్తాయి— నవ్విస్తాయి? ఆలోచింప చేస్తాయి. వర్తమాన సాహితీ రంగ స్థితిగతులకు అద్దంపడుతుంది ఈ కథ.

'దిగ జారిన ముత్యం' కథ వాస్తవిక జగత్తు కు ప్రకృతికి మధ్యగల సంబంధమును, వీటి మధ్య నలుగుతున్న మనిషికి గల బంధాలను అనుసంధానం చేస్తుంది. రచయిత 'చివరకు మిగిలేది' రచనలో, ఆచార సంప్రదాయాలు మనిషిని బాధిస్తాయి- వాటి నుంచి దూరంగా పారిపోవాలనిపిస్తుంది. తిరుగుబాటును ప్రోత్సహిస్తాయి. మరలా మనిషిని జోకొడతాయి. ఈ పరిస్థితులలో మనిషి నైతికత అనైతికతల మధ్య సమరం చేస్తాడు. చివరకు విజయం సాధిస్తాడు కాని సమాజం ఆ విజయాన్ని హర్షించదు. తాము చేయలేని పనిని చేసినందుకు గాను సమాజం అతనిని హేళనచేస్తుంది. అటువంటి అసాధారణ వ్యక్తులకు విలువ నివ్వాలంటారు. సంప్రదాయానికి లొంగిపోయిన వ్యక్తులు ప్రజాస్వామ్యంలో వ్యక్తిత్వ ప్రకర్షకి అవకాశం లేక పోవటం వల్ల కుతంత్రం సాగించి జీవితాన్ని మలినం చేసుకుంటారు.

సాహిత్యం, సమాజం, వ్యక్తులపై ప్రభావం చూపుతుంది, కనుక ఉత్తమ సాహిత్యం మాత్రమే సృజియించబడాలి అనేది బుచ్చిబాబు భావన. అనేక రకాల చెత్త సాహిత్యం వ్యక్తుల హృదయాలను కలుషితంచేసి 'కృతిమత్వపు పొరలను' తొడుగుతుంది. ఈ అంశాన్ని వ్యంగ్యాత్మక శైలిలో వాస్తవికతకు దగ్గరగా రచించిన కథ 'కార్య సాధకుల మహాకావ్యం'. ఒక పుస్తకమును చదివి దానిలో రచయిత సిద్ధాంతీకరించిన సూత్రం ప్రకారం ఇద్దరు వ్యక్తులు ప్రవర్తించిన తీరును హాస్య రసాత్మకంగా బహుచక్కగా వర్ణిస్తారు బుచ్చిబాబు.

ప్రతివారు ఎదుటి వారికి తమ కష్టాలను మాత్రమే చెబుతారు. ఇటువంటి వారు తన చర్యల వలన ప్రయోజనాలు కంటే సానుభూతిని మిన్నగా పొందుతారు. అసలు ఇటువంటి వ్యక్తులు సమాజం నుంచి కోరుకొనేది కూడ ఇదే' అదే; నా జీవితం హాయిగా గడిచి పోతున్నది' అని అన్నవారు బహుశ ఒక్కడు కూడా వాస్తవిక జగత్తులో ఉండడు అంటారు రచయిత. 'కాలచక్రం' ఆగింది కథలో ముకుందం తన ధోరణిలో అతిగా వాగుతూ సమాజమును పరిశీలించడం అలవాటు చేసుకున్న వ్యక్తి. ఇటువంటి ముకుందం పిచ్చివాడవుతాడు. ఈ సందర్భంలో రచయిత 'తుష్యకృత్రిమత్వం, దాస్యం నిద్రలో కూడా విరామంలేని మనోవ్యాకులతలో పరిభ్రమిస్తున్న వ్యక్తులందరికి ఎందుకు పిచ్చెత్త లేదా అనే సంశయం కలుగుతుంది'. చివరకు ముకుందంకు పిచ్చిపట్టడానికి అతని భార్య గయ్యాళితనమే కారణమంటారు రచయిత. ఈ కథలో ప్రతిపురుషుని విజయం వెనుక అపజయం వెనుక కూడా స్త్రీ ఉంటుంది అనేది రచయిత అభిప్రాయం.

మనిషికి ''జ్ఞాననేత్రం'' ఎంతో అవసరం, కాని ఒక్కొక్క సమయంలో జ్ఞానం సైతం

ఇబ్బందులకు గురిచేస్తుంది. ఇటువంటి 'జ్ఞానం' ఉండటంకన్నా అజ్ఞానమే ఉత్తమమనిపిస్తుంది. అంటాడు 'జ్ఞాననేత్రం' కథలో. మూలసూత్రం ఇదే సమాజంలో దురాచారాలున్నప్పుడే మనిషిలో ప్రగతి కోసం తపన మొదలవుతుందని రచయితభావన. ఒక దేశం స్వయంపోషకమైపోయి సంపూర్ణమైనసంతుష్టి అలవర్చుకున్నపుడు ఇక సాధించేందుకు ఏమి ఉండదు. మనిషి యొక్క పరిపూర్ణతని అతని 'వార్ధక్యం' నిర్ణయించదు ఈ ఆశాన్ని ప్రోదీకరించి 'శాస్త్రి' పాత్ర "జ్ఞాననేత్రం' ఆవశ్యకతను పాఠకులకు తెలియజేస్తుంది. 'రెండుకళ్ళుండి కూడా చూడలేకపోతున్న ఈ గుడ్డి ప్రపంచం నా మూడో కన్నును (జ్ఞాననేత్రం) క్షమిస్తుందా? అనే శాస్త్రి గారి ప్రశ్న సమాజ స్వరూపాన్ని పాఠకుల కళ్ళ ముందు ప్రత్యక్షం చేయిస్తుంది.

వాస్తవిక జగత్తులో మునిగి నిరంతరం గందరగోళాల మధ్య బ్రతుకు సమరం కొనసాగిస్తున్నాడు. మానవుడు అతని ఆలోచనలో చైతన్య ప్రకంతులను 'నాగార్జు మేడ' కథలో ఇలా వర్ణిస్తాడు. నాకీ ప్రపంచం గందరగోళంగా ఉంది, జాడ్యాలు, కుళ్ళు యుద్ధాలు, వార్ధక్యం, మృత్యువు వీటి నుండి తప్పించుకొని పారిపోవాలని ఉంది దూరంగా ఒంటరిగా ప్రశాంతంగా గడపాలని.' వుంది మనిషి సుఖంగా బతికేందుకు మార్గంలేక కేవలం ఆలోచనలలోనే కాలం గడిపే పాత్రలు బుచ్చిబాబు రచనలలో కనిపిస్తాయి. ఇటువంటి పాత్రల ద్వారానే సమాజపరమైన వాస్తవికతను సృష్టిస్తాయి.

బాల్యంనాటి స్మృతులు కాలంగడిచిపోతున్న కొద్దీ మాధుర్యాన్ని రెట్టింపుచేస్తాయి. సామాజిక పరమైన సంప్రదాయం తప్పు కట్టుబాట్లు మధ్య బిగించుకుపోయిన స్త్రీలకు ఏమి మిగులుతుంది. కంటిక్రింద బేరించే ముడతలు తల్లోలెక్కలేనన్ని తెల్లవెంట్రుకలు. ఇంతే జీవితం ఆనాడు నేను అతను కలసి జీవించాం, ఈనాడు జీవితాన్ని ఆలోచిస్తూ విశ్లేషించుకుంటున్నాం ఈ కక్షలు, ఈర్ష్యలు, పోటిలు పట్టుదలలు పోను-పోను, దారి సన్నబడి ఆకారం చీకటై పోతుంది. వెనుక తెలుసుకున్న రహస్యం మళ్ళీరాదు...' 4711 టాస్కా కథలో కరిగిపోతున్న జీవితం గురించి ఒకపాత్ర పడే తపన ఇది వాస్తవిక ప్రపంచం మనుషుల్ని యాంత్రికత వైపుగా తీసుకువెడుతున్న సమయంలో జీవులు ఇంత కన్నా ఏం ఆలోచిస్తారు.

కుటుంబంలో స్త్రీ పురుషులు 'మంచి'గా ఉండటానికి నటన అవసరం అంటాడు బుచ్చిబాబు అన్యోన్యతకు పర్యాయపదల వ్యక్తుల మధ్య విపరీతమైన 'నటన' అనేది బుచ్చిబాబు ప్రతిరచనలోనూ మనకు కనిపిస్తుంది. 'సౌందర్యాన్వేషణను' గురించి వర్ణనలు బుచ్చిబాబు చేసినంతగా మరొకను చేయలేదు. సౌందర్యాన్వేషణను అంతర్లీనంగా ప్రవహింపజేస్తూ భార్యభర్తల మధ్య అబద్దాల అన్యోన్యతను 'సౌందర్యాన్వేషణ' కథ తెలియజేస్తుంది. చివరిలో రచయిత చేసిన ఒక వాఖ్యాలు ఈ కథను గురించి వివరించడానికి, పార్వతమ్మ ఎంత వరకు నిజం చెప్పిందో పరంధామయ్యకు తెలుసు. తనెంత చెప్పారో ఆమెకు తెలుసు, ఇది అన్యోన్యం కాక మరేమిటి? వర్తమానంలో 'కోట్ల' కుటుంబాలలో ఇటువంటి అన్యోన్యత మనకు నిత్యం కనిపిస్తుంది. అయితే దీనిని వాస్తవిక దృష్టిలో మనం అంగీకరించాం ఎందుకంటే అటువంటి కుటుంబాలలో మనది 'కూడా' ఒకటి.

ప్రేమికులుగా ఉన్నప్పుడు కలిగిన ఆనందం, వివాహానంతరం ఆ జంటకు ఉండదు. సమాజం, వ్యక్తులు, బాధ్యతలు కుటుంబం వంటివి అవరోధా

లకు, అవాంతరాలకు చిహ్నాలు. ఇవి వారిరువురి వైవాహిక జీవితంలో అశాంతిని కలుగజేస్తాయి. వారి మధ్య ప్రేమను తుడిపేస్తాయి. వాస్తవాలను తెలియజేస్తాయి. కాని గతకాల జ్ఞాపకాలు వారి మధ్య నడిచిన 'లేఖలు' మాత్రమే ప్రేమికులకు చెరగని స్మృతులు. చంద్రం, అరుణలు ప్రేమించి పెళ్ళి చేసుకుంటారు. మధ్యలో చంద్రం స్నేహితుడు 'సింహం' వారి మధ్యకు వస్తాడు. అరుణ సింహాలు చనువుగా మసలుతారు కాని సింహం వెళ్ళి పోయాక అరుణ లేఖ చదువు తుండగా చంద్రం చూస్తాడు. అదేమిటని అడుగుతాడు ఆమె సమాధానం చెప్పదు విధి లేక ప్రేమికుడైన చంద్రం ఆమెను సింహం ఇచ్చిన 'కొరడా'తో హింసిస్తాడు. చివరికి లేఖ అతని చేతికి అందుతుంది. ఆలేఖ తన అరుణ ప్రేమికులుగా ఉన్నప్పుడు వ్రాసుకున్నది అయితే ఎందుకు ఆలేఖలను దాచుకుంది? రహస్యంగా ఎందుకు చదువుచున్నది గతించిన కలలు తిరిగి ఊహలలో సృష్టించుకొని, రహస్యమైన ఆనందం పొందుతాము' అప్పుడు గ్రహిస్తాడు చంద్రం తమ మధ్య పూర్వపు 'ఆనందం'లేదని అతని దగ్గర డబ్బు అందం, ఆరోగ్యం అన్ని ఉన్నాయి కాని పాత జ్ఞాపకాలను పంచి ఇచ్చే హృదయం లేదని గ్రహిస్తాడు వారిరువురు ప్రేమికులు కాదు కేవలం భార్య భర్తలు.

ఈ విధంగా బుచ్చిబాబు కథలు సమాజంలోని వాస్తవిక మనుషులకు దగ్గరగా ఉండుటయేకాక తన రచనలలో స్త్రీలపట్ల ప్రత్యేక ఆదిపత్యం చూపిస్తాయి. 'నవరస భరితము'గా పాఠకునకు స్ఫూర్తిని; ఆర్తిని కల్గించే విధంగా చూస్తు తన వలన యువతరానికి ప్రత్యక్షమైన సందేశమిస్తున్నట్లుగా ఉంటాయి. ఈ విధంగా తెలుగు నవలా సాహిత్యంలో బుచ్చిబాబు పాత్ర చిరస్మరణీయమని' చెప్పవచ్చు.

సాహిత్యపీఠం
తెలుగు యూనివర్సిటీ
బొమ్మూరు.

# అగ్నిపురాణము- వైజ్ఞానిక అంశములు

సముద్రాల శఠగోపాచార్యులు

వేదవాఙ్మయంవలె పురాణ వాఙ్మయం కూడా అతి ప్రాచీనమైనది కూడా. వేదాలను విభజించినట్లే పురాణ వాఙ్మయానికి కూడా ఒక నిశ్చిత రూపము ఇచ్చి తీర్చిదిద్దినవాడు వ్యాసుడు. ఈనాడు వ్యాసకర్తృకములుగా చెప్పబడుతున్న 18 పురాణముల పేర్లు ఈ క్రింది శ్లోకము ద్వారా తెలియుచున్నది.

'మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వ
చతుష్టయమ్ ।
అనాపలింగ కూస్కాని పురాణాని ప్రచక్షతే'॥

1) మత్స్య, 2) మార్కండేయ 3) భవిష్య 4) భాగవత 5) బ్రహ్మాండ 6) బ్రహ్మ 7) బ్రహ్మవైవర్త 8) వామన 9) వరాహ 10) విష్ణు 11) వాయు 12) అగ్ని 13) నారద 14)

పద్మ 15) లింగ 16) గరుడ 17) కూర్మ 18) స్కంద పురాణములు. ఇవే కాకుండా ఉప పురాణాలు కూడా 18) కలవని ఇంకను పురాణములనే పేరుతో మరికొన్ని గ్రంథాలు కూడా లభిస్తున్నట్లు తెలియుచున్నది.

అతి ప్రాచీన కాలము నుండి రెండు వాఙ్మయ ప్రవాహాలు ఆవిర్భవించి పరస్పరోపకారకాలుగా ఉంటూ వేరువేరు మార్గములలో ప్రవహిస్తున్నాయి. మొదటిది వేదవాఙ్మయ ప్రవాహము. రెండవది పురాణవాఙ్మయ ప్రవాహము. వేదవాఙ్మయ ప్రవాహమును బ్రహ్మ నుండి ఋషులు గ్రహించి ప్రచారం చేయగా, పురాణ ప్రవాహమును మునులు స్వీకరించి ప్రచారం చేశారు. అందుచేత ఈ రెండు కూడా సమాన ప్రామాణ్యం కలవి. ఈ విషయం మార్కండేయ పురాణములో చెప్పబడినది.

'ఉత్పన్నమాత్రస్య పురా బ్రహ్మణోऽవ్యక్తజన్మనః
పురాణమేతద్వేదాశ్చ ముఖేభ్యోऽనువినిస్సృతాః
వేదాన్ సప్తర్షయస్తస్మాజ్జగృహుస్తస్య మానసాః
పురాణం జగృహుశ్చాద్యా మునయస్తస్య మానసాః'' మా.పు.45

భారతీయ సంస్కృతికి (జీవనాడైన ఆయువుపట్టు వేదములు. వేద విషయములను సులభముగా తెలుసుకొనుటకు స్మృతి, పురాణ ఇతిహాసములు తోడ్పడుతున్నాయి. పురాణేతిహాసముల సహాయముతోనే వైదిక విషయములను గ్రహించవలెనని తెలుస్తున్నది.

పురాణములు వైదిక విషయములను సులభముగా, విపులముగా తెలపడము వల్లను భారతీయ సంస్కృతికి ఆయువుపట్టుగా ఉండడము వల్లను ఎంతో ప్రాముఖ్యమును సంతరించుకున్నవి. ఇంతియేకాకుండా ఎంతో ప్రాముఖ్యమయిన అత్యంత ఉపయోగమయిన వైజ్ఞానిక విషయములను కూడా పురాణములు కలిగియున్నాయి.

పురాణములన్నియు వైజ్ఞానిక అంశములను కలిగియుండటములో అగ్రగామిగా ఉన్నవి.

ముందు అగ్నిపురాణమును గూర్చి మరి కొంత తెలుసుకొని తర్వాత వైజ్ఞానిక అంశములను తెలుసుకొందము.

ఈ పురాణము అగ్నిరూపుడైన శ్రీ మహావిష్ణువు నుండి ఆవిర్భవించడం చేత దీనికి 'అగ్ని మహాపురాణము'' అని పేరువచ్చినది. అగ్నిదేవుడు వశిష్ఠునకు చెప్పిన ఈ పురాణాన్ని, వ్యాసుడు వశిష్ఠుని నుండి గ్రహించి తన శిష్యుడైన సూతునికి బోధించెను. అగ్నిపురాణములోని శ్లోకసంఖ్య మాత్రము వివిధ పురాణాలల్లో వేర్వేరుగా చెప్పబడినది.

అగ్నిపురాణములో 15000 శ్లోకములున్నవి–భాగవతము అగ్నిపురాణములో 16000 శ్లోకములున్నవి–మత్స్యపురాణము అగ్నిపురాణములో 12000శ్లోకములున్నవని అగ్నిపురాణములోని 272వ అధ్యాయములో చెప్పబడగా 15000 వేల శ్లోకములున్నవని చివరి అధ్యాయములో వేరుగా చెప్పబడినవి. శ్లోక పరిమితి విషయములో ఒక నిశ్చయం లేకున్నను 383 అధ్యాయాలుకల ఈ మహాపురాణము పరాపరవిద్యలకు సంబంధించిన విషయములతో కూడియుండడమే కాకుండా.

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితంచైవ పురాణం పంచలక్షణమ్॥

అను పురాణ లక్షణం ప్రకారం ఈ పురాణములో కూడా 1) సృష్టి 2)అవాంతర సృష్టి లేదా

ప్రళయము 3)దేవాదుల వంశాదులు 4)మన్వంతరాలు 5)రాజవంశాలు అను అయిదు విషయముల ప్రసంగం 17నుండి20 అధ్యాయములలో కలిగి ఉన్నది.

118 నుండి 120 అధ్యాయాలలో భారత దేశము 'దాని ఎల్లలు' ఆయా ప్రదేశముల వైశాల్యాదులు వర్ణింపబడినాయి 121–129 అధ్యాయములలో ఖగోళశాస్త్రము, జ్యోతిషశాస్త్రము, సాముద్రికశాస్త్రము మొదలైన విషయములు ప్రతిపాదింపబడినవి 369–370 అధ్యాయములలో మనుష్యాయుర్వేదమే కాకుండా, గజాశ్వ వృక్షాది ఆయుర్వేదము కూడా చెప్పబడింది. 369, 370 అధ్యాయములలో మానవుని శరీరానికి సంబంధించిన వివిధ భాగాల వర్ణన కూడా ఉన్నది.

మధ్యయుగానికి చెందిన భారత దేశములో ప్రచారములో ఉన్న అన్ని శాస్త్రీయ విషయములు ఈ పురాణములో పొందుపరచబడి ఉన్నాయి. కావున "అగ్నిపురాణము ఒక విజ్ఞాన సర్వస్వము ఆని చెప్పవచ్చును.

అగ్ని పురాణములో ఎన్నో శాస్త్రీయ విషయములు, అనేక శాస్త్ర వర్ణనలు కలవు రామాయణము, భారతము, భగవద్గీత హరివంశము, తన గురించి కూడా వర్ణనలు కలవు.

పురాణారంభంలో 2, 3 అధ్యాయాలలో దశావతారముల వైభవం గురించి, తర్వాత 5నుండి 11 అధ్యాయములలో రామాయణములోని వృత్తాంతం సంక్షిప్తంగా వర్ణించబడినది.

గృహ, శిల్పకళ, మూర్తిప్రతిష్ఠ, (పూజా విధానం) నాలుగు ఉపవేదముల గురించిదార్శనిక విషయములను గురించి, పశుచికిత్సా, రత్నపరీక్షా, వస్తువిద్యా, జ్యోతిష, ధర్మశాస్త్ర, రాజనీతి, ఆయుర్వేదాది శాస్త్రముల వర్ణనలు ఈ పురాణమునందు విస్తృతముగా కలవు.

క్రమముగా ఇందలి వైజ్ఞానిక విషయములను దిగ్దర్శన మాత్రముగా పరిశీలించెదము.

గృహముల ప్రాసాదముల నిర్మాణమెట్లు చేయవలెనో 41అధ్యాయములోని 3, 4శ్లోకములు మనకు బోధపరచుచున్నవి.

> "ఇష్టకాశ్చ సుపక్వాః స్యుః ద్వాదశాంశల సంమితాః॥
> సువిస్తార త్రిభాగేణ వైపుల్యేన సమన్వితా"॥
> కర ప్రమాణా శ్రేష్ఠాచ్ఛిలా పృథ శిలామయే
> నవ కుటాన్మిస్త్రామ)మయాన్ స్థాపయే దిష్టకా ఘటాన్॥

గృహ నిర్మాణ సమయములో ఉపయోగించు ఇటుకలు బాగుగా కాలినవై యుండవలెను. వాటి పొడవు పండ్రెండు అంగుళములు దళసరిపొడవులో మూడవవంతు అనగా నాలుగు అంగుళములుండవలెను. ఇటుకల బదులు రాళ్ళతో కట్టవలిస్తే రాయి చెయ్యంత పొడవు ఉండవలెనని చెప్పబడినది.

41, 42 అధ్యాయములలో ప్రాసాద లక్షణము చెప్పబడినది. 44వ అధ్యాయములో శిల్పశాస్త్ర విషయములు చెప్పబడినవి.

121వ అధ్యాయములో జ్యోతిషశాస్త్రము గురించి

> "జ్యోతిషశాస్త్రం ప్రవక్ష్యామి శుభాశుభం నివేదకమ్।
> చాతుర్లక్షస్య సారం యత్ తద్జ్ఞాత్వా సర్వవిద్ భవేత్॥

శుభా శుభా వివేకమును ఇచ్చునదియు, మనుష్యుని సర్వజ్ఞునిగ చేయునదియు నాలుగు లక్షల శ్లోకముల జ్యోతిష శాస్త్రము యొక్క సారమును

సంక్షిప్తముగా చెప్పెదను అని వ్యాసుడు జ్యోతిష విషయ వర్ణనలను చేసెను.

వధూవరుల రాశ్యాధిపతులు, పరస్పర మిత్రులైనను, రెండు రాశుల అధిపతియు, మూడు సమ సప్తకము, అయినచో శుభప్రదము. వధూవరుల రాశ్యాధిపతులు పరస్పర మిత్రులైనను రెండు రాశుల అధిపతియు ఒక్కడేయైనను ఇరువురి జన్మనక్షత్రములకు మైత్రియున్నను, పంచమ, నవమ ద్విర్ద్వాదశ దోషములు చూడక వివాహము చేయవచ్చును. అన్నప్రాశనము మొదలగు సంస్కారముల గూర్చి ఈ అధ్యాయములో విస్తృతముగా చర్చించబడినది. ఇక 120 అధ్యాయములో భౌగోళిక విషయములను పరిశీలిద్దాము.

విస్తారస్తు స్మృతో భూమేః సహస్రాణి చ సప్త
ఉచ్ఛ్రాయో దశ సాహస్రం పాతాలం చైక మేకశమ్ ॥

భూమి విస్తారము 70 వేల యోజనములు, రవి ఎత్తు పదివేల యోజనములు. భూమి క్రింద ఏడు పాతాళములున్నవి. ఒక్కొక్క పాతాళం లోదేసి వేల విస్తారము గలదు.

1) అతలము 1) వితలము 3) సుతలము 4) తలాతలము 5) రసాతలము 6) మహాతలము 7) పాతాళము అని వాని పేర్లు. మరియు సూర్యుడు ఒక లక్ష యోజనముల దూరమునందుండున సూర్యునకు లక్ష యోజనముల దూరములో నక్షత్ర మండలము ఉన్నది. ఈవిధముగా భౌగోళిక వైశాల్యము. ఖగోళ వైశాల్యము తెలుపబడినది. ఊర్ధ్వలోకములయిన మహర్లోక, జనలోక, తపోలోక సత్యలోకాదుల వైశాల్యము వర్ణించబడినది.

"కాలః సమాగణో వక్ష్యే గణితం కాల బుద్ధయే" అని అగ్ని పురాణములో 122వ సర్గలో అతి విస్తృతముగా కాల గణనము గురించి వర్ణించబడినది.

ఇంక 249 నుండి 252 అధ్యాయముల వరకు ధనుర్వేదము గురించి, 283వ అధ్యాయములో సర్వరోగములను హరించు ఔషధముల గురించి విశదముగా వర్ణించబడినది, 337 నుండి 346 వరకు అలంకార శాస్త్రము 349 నుండి 359 వరకు వ్యాకరణ శాస్త్రము గురించి విస్తృత వర్ణనలతో కూడిన ఈ అగ్ని పురాణము వైజ్ఞానిక విషయములతో పాటు శాస్త్రీయమైన విషయములను కూడా కలిగి యుండటం విశేషం.

ఈ విధముగా (అనంతమైన) పెక్కు విషయములను మనకు సులభముగా అందించుచున్న వాఙ్మయం ఒక్క పురాణవాఙ్మయమే అనుటలో అతిశయోక్తి లేదు అని అనిపించుచున్నది. వైజ్ఞానిక శాస్త్రీయ విషయములు మరియు దేవాలయ ప్రతిష్ఠాత్మక, ఆరాధనా విషయములు ఈ అగ్నిపురాణము నందు వర్ణింపబడినది.

మన దేశములోని ఒకరి నుండి మరొకరు ఈ విధముగా కర్ణాకర్ణికగా తెలుసుకున్న పౌరాణిక విషయములే ఎక్కువ ఉండునవి.

ఆధునిక సాహిత్యముతో పాటు ప్రాచీన సాహిత్యము కూడా నేటికీ తెలుసుకోదగినదే. పురాణాలు కేవలం కథలతో కూడుకున్నవికావు వేదవాఙ్మయం వలె పురాణ వాఙ్మయము కూడా ఆధునిక విషయములను వైజ్ఞానిక విషయములను కలిగియుంది.

ఈ విధముగా ఎన్నో విధముల ఉపకరించు పురాణ వాఙ్మయమును ప్రతివాడు చదివి ఆనందించవలసిన అవసరము నేడు చాలా ఉంది.

సంస్కృత లెక్చరర్ ఎం ఏ (ఎంల్)
ఉస్మానియా ఉమెన్స్ కళాశాల, కోఠీ, హైదరాబాద్.

# పుస్తక సమీక్ష

## సాకేత రామాయణము

ప్రపంచంలో వాల్మీకి రచిత రామాయణం అనేక భాషల్లో, అనేక ప్రక్రియల్లో అనువాద రూపంలో వెలువడి, విశ్వ జనీనమై విలసిల్లింది. కొన్ని కొన్ని భాషల్లో మార్పులూ, చేర్పులూ సంతరించుకొన్నది, ఆ రామాయణాన్ని హిందీ భాషలో తులసీదాసు 'రామ చరిత మానస్. అనే పేరుతో రచించాడు. అది హిందీ భాషీయులకే కాక అహిందీ భాషీయులకు కూడ ఆదరణీయమై స్తుతి పాత్రమై విరాజిల్లినది. రామచరిత మానస్ తరువాత ఆధునిక కాలంలో వెలువడిన సాకేత్ హిందీ భాషకు గొప్ప అలంకారమై రాణించింది.

సాకేత్ రచయిత మైథిలీశరణ్‌గుప్త మహాకవి. హిందీ సాహిత్య జగత్తులో వెలసిన సంపూర్ణపూర్ణిమా చంద్రుడు. తనదైన రస సత్కవిత చేత జాతీయ భాషను వెన్నెల వెలుగులతో నింపారు. మైథిలీ శరణ్ గుప్త గొప్ప జాతీయ వాది. స్వాతంత్ర్య సమరయోధుడు. ఆయన తన సాహిత్యాన్ని జాతీయతకు అనుగుణంగా సాగించి హిందీ ప్రేమికులకేకాక భారతీయులందరికీ అభిమాన స్థానీయుడైనాడు. మైథిలీ శరణ్, మహాకవి సృష్టించిన మహాకావ్యం సాకేత్. ఇది రామ కథా సుధా చరితమే అయినా కావ్యం నూతన పద్ధతిలో రచితమైనది. జాతీయ భావ పరిపూరితమై, శ్రీరామ మహిమ పరిపూరితమై భాసిల్లింది.

ఇట్టి మహా కావ్యాన్ని గాదంశెట్టి శ్రీరాములు గారు చక్కని, చిక్కని వచన రచనగా అనువదించారు, శ్రీరాములు గారు హిందీ భాషా కోవిదులు. హిందీ లోను, తెలుగు లోను గ్రంథ రచన చేసి ప్రశస్తి వహించారు. రచన సులభ సుందరమైన వ్యావహారిక భాషలో సాగింది.

వా రామాయణంలో ప్రాధాన్యానికి నోచుకోని ఊర్మిళ పాత్రకు సాకేత్‌లో ప్రాముఖ్యం లభించింది. సాకేత్‌లో ఊర్మిళయే కథానాయికగా భాసిల్లింది. కైకేయి, మాండవి, శ్రుతకీర్తి పాత్రలు ప్రాధాన్యం వహించాయి. ఊర్మిళ పాత్ర ఇంచుమించుగా కావ్యమంతటా కమనీయ స్వరూపంతో కనపడుతుంది. ఊర్మిళ సాకేత (అయోధ్య) నగరంలో ఉంటూ అనేక విధాలుగా ఆవేదన చెందుతూ చెలికత్తెలకు తన హృదయగత వేదనను ప్రకటిస్తూ, కోయిల, చాతకము, మేఘమూ, తీగ, పండుటాకులు, మొదలైన ప్రకృతిలోని వస్తుజాలమును సంబోధిస్తూ రకరకాలుగా ఆవేదనను వెల్లడిస్తుంది. అందుకే నవమసర్గ కరుణ రస భరితమై సాకేత్ కావ్యంలో 'తత్రాపిచనవమ సర్గగా'

---

రచన మైథిలీ శరణ్ గుప్త
అనువాదకులు– గాదం శెట్టి శ్రీరాములు
వెల రూ. 25=00.
ప్రతులకు– జి. శ్రీరాములు ఎమ్. ఎ.
రిటైర్డ్ లెక్చరర్
డబ్ల్యు. 4/205: మసీదు వీధి
గూడూరు. 524 101 నెల్లూరు జిల్లా

---

ప్రాముఖ్యం వహించింది. నవమసర్గ మైథిలీ శరణ్ మహాకవి ప్రతిభాసంపదకు పరాకాష్ఠగా భాసిల్లింది.

ఇక అనువాద విధానాన్ని పరిశీలింతాము. శ్రీరాములుగారు అనువాదాన్ని మక్కీకిమక్కీగాకుండా కొన్నిచోట్ల కాస్త సంగ్రహంగాను, కొన్నిచోట్ల కొంత వివరణ పూర్వకంగానూ సంతరించారు. ఇందుకు కొన్ని ఉదాహరణలు చూపబడుతున్నాయి.

శ్రీరాములు వనవాసానికి వెళ్ళుతూ మాతృభూమిని గురించ నివేదించిన మాటలు.

> 'జన్మభూమిః లే ప్రణతి ఔర్ ప్రస్థానసే
> హమ్‌కో గౌరవ్, గర్వ్ తథా నిజ్ మాన్ దే
> తేరే కీర్తి-స్తంభ, సౌధ్, మందిర్ తథా
> రహే హమారా శీర్ష్ సమున్నత్ సర్వథా
> జాతే హై హమ్ కింతు సమయ పర్ ఆయేంగే
> అకర్షణ్ తబ్ తుఝే ఔరభీ పాయేంగే'
> అనువాదం ఈలా సాగింది.

'ఓ మాతృభూమీః నా ప్రణామం స్వీకరించు. మమ్మ సాగనంపు. మాకు గౌరవం, అభిమానము, ప్రతిష్ఠ లభింపజేయి. నీ కీర్తి స్తంభాలవలె మా శిరస్సులు ఎల్లప్పుడూ ఉన్నతంగా ఉండాలి. మేము ఇప్పుడు వెళ్ళిపోయినా గడువు పూర్తికాగానే తిరిగి వస్తాము.

> 'సూక్ష్మ రూపమేఁ సభీ కహె తూ సాథ్‌హూఁ
> తేరా స్వచ్ఛ సమీర్ హమారే శ్వాస్‌హై
> మానస్‌మేఁ జల్ ఔర్ అనల్ ఉచ్ఛ్వాస హై

సూక్ష్మరూపంలో ఎల్లప్పుడూ మా వెంట ఉండాలి. మా శ్వాసలో కూడా నీ పవిత్ర వాయువే వ్యాపించి ఉంది. మానస సరోవరం లాంటి మా హృదయంలో నీ జలమే ఉంది.

> 'హమ్ మె అప్నే తుక్ దుగ్ధ ధామ్ కే విష్ణు హైఁ
> హైఁ అనేక్ భీ ఏక్, ఇసీసే జిష్ణు హైఁ

'నీవు క్షీరసాగరం లాంటి దానివి. నేను అందులో నివసించే విష్ణువు లాంటి వాడిని. ఇందు వల్లనే మేము ఎప్పుడూ విజయం పొందుతూ ఉంటాము.

శ్రీ గారం శెట్టి శ్రీరాములు గారు చక్కని వచనంలో సాకేత్ కావ్యాన్ని అనువదించినందుకు అభినందనీయులు.

**వేముగంటి**

# ప్రతిబింబాలు

## (ఖండ కావ్య కదంబము)

ఇది కవి పితామహ ఉట్ల కొండయ్యగారు సంపుటీకరించిన తమ పద్య కవితా కదంబం. ఇందులో 27 కవితాఖండికలున్నాయి. ఒకటి గేయం. మిగిలినవన్నీ పద్యకవితలు.

కొండయ్యగారు 79 సంవత్సరాల వృద్ధాప్యంలో కూడా యువకవిగా కవితా రచన నిర్విరామంగా సాగించడం ప్రశంసనీయం. కొండయ్యగారు ఏది వ్రాసినా అందులో నవ్యత గోచరిస్తుంది. ఇందుకు ఉదాహరణగా వీరి చాకిరేవు. 'వానవచ్చె వరద వచ్చె' మొదలగు కృతులను గమనింపవచ్చు.

కొండయ్యగారు ఏ లాంటి అనుకరణచ్ఛాయ లేకుండా తమదైన వాణితో కవితా రచన చేస్తున్న కవివర్యులు. తమ కవితా గురువు కాటూరి వేంకటేశ్వరరావుగారు అయినా కాటూరి కవితానుకరణ కొండయ్యగారి కవితలో కనిపించదు.

ఈ కవితా సంపుటిలోని పద్యకవితలన్నీ హృద్యంగా, అనవద్యంగా ఉన్నాయి. ప్రతి కవితలో కవి యొక్క ఆత్మీయత గోచరిస్తుంది, మహనీయవ్యక్తులైన ప్రభాకర్జీ దామోదరం సంజీవయ్య, విశ్వనాథ, దేవులపల్లి రామానుజరావు మొదలగు వారిని గూర్చి ఎంతో ఆత్మీయంగా కవిత చెప్పారు.

'హిందూ ముస్లిం క్రైస్తవ
సందోహాస్పదము నీ ప్రశస్తమతమ్మె
సుందర శివ సత్యములకు
స్యందనమై ధరణికిన్ శుభావహమయ్యెన్'

అంటూ ప్రభాకర్జీని ప్రస్తుతించారు.

---

రచన—'కవి పితామహ' ఊట్ల కొండయ్య
వెల 6 రూపాయిలు
ప్రతులకు—కాటూరి కవితాపీఠం
మాధవి ప్రింటర్సు
కత్బిగూడ, హైద్రాబాదు—500017.

విశ్వనాథ యనుచుఁ బిలిచినఁ జాలును
మా త్రిలింగ పుణ్యధాత్రిలోనఁ
బ్రిన్నసంపు బాట కిన్నెరమై షా ఘుఁ
బద్య కోటి వేయిపడగలెత్తు'

అని విశ్వనాథ వారిని వినుతించారు. చమత్కారంగా.

'హరునితోడ నేల వరయాచకము
విడువు గంగనను చుడువగలవు'

అంటూ శ్రీనాథుని పూజించారు.

'నరహరు జనుడు' అనే కవితా ఖండికలో
'హరిజనుడవు గావయ్యా!
నరవరుడవు, సోదరుడవు, నవ నరుడవు'

అని హరిజనుని కొనియాడినారు కవి.

ఏది చెప్పినా కొండయ్యగారు అందంగా, ఆమోఘంగా చెప్పగలరు. వారి భావనా బలం చాలా గొప్పది. ఇందుకు ఉదాహరణగా ప్రమోదము, ఆంగీరస, శ్రీముఖ మొదలైన సంవత్సరాల ఉగాది పండుగలను గూర్చి ప్రకటించిన భావాలను పరిశీలించవచ్చు.

"కాలపు రంకుల రాటము
దోలన్ దిగినావుగా, యిటులరావమ్మా!
ఆలములకు నెలవగు మా
యాలయములఁగాలి యందియలు రవళింపన్'

అంటూ 'పుట్టింటిలో ప్రమోద' న్న గూర్చి చెప్పారు కవి.

సంసార సాగరంలోని కొన్ని చమత్కార వీచికలు మనముందుంచారు. అందులో ఒక వీచిక

'తండ్రి హృదయ రోగి, తల్లి యున్మద రోగి'
కొడుకు సహన రోగి, కోడలమ్మ
కోప రోగి నాల్గు గుణదోషముల తోడ
సంపళయ్య యాయె కొంప గోడు"

ఇంత వయస్సులో కూడ కలం దించకుండా కవితా రచన చేస్తున్న కొండయ్య గారు నేటి పద్య కవితకు కొండంత అండ.

వేముగంటి

# నాగభైరవ కవితల హరివిల్లు

నేటి సమాజంలో సామాన్యుని బతుకులో వెలుగు నీడలు శ్రీనాగభైరవ కవితలు. "భాగ్యనగరం గడియారాలు, రిటైర్‌మెంటు. అసమర్థుని జీవయాత్ర" కవితలు కవిసామాన్యుని హృదయాన్ని సరిగా అర్థం చేసుకొని రాసినవి,

భాగ్యనగరంలో "సాయంత్రాలు సరదా కబుర్లతో బూడిదై పోతాయి./ మునిమాపులు 'బారీ' లవుతాయి. అప్పటికే పిల్లలు/ మునీశ్వరులై ముసుగుల్లో/ తపస్సు చేస్తుంటారు/ రెండు వడ్డించని కంచాలు/ రెండు కన్నీటి కల్హారాలు/మౌనవిరహ గీతాలై/ ఎదురుచూస్తుంటాయి" అన్నారు. ఈజీవిత చిత్రంలో 'కన్నీటి కల్హారాలు' కవి తిలక్‌ను జ్ఞాపకం చేస్తాయి.

'బడుగు ఉద్యోగి జీవితంలో ముప్పయి అరేళ్ళ ముష్టిచాకిరి/ ముసలితనమై ఒళ్ళంతా ముసురుతుంది. పరాయి ఊళ్ళలో/ ఉద్యోగిస్తున్న కొడుకులూ కాపురిస్తున్న కూతుళ్ళూ/ కుటుంబాలతో సెలవులకు వచ్చి/ రెండు నిండు సరోవరాల్లో/ బండరాళ్ళు విసురుతారు' తర్వాత ముసలి దంపతులు మనశ్శాంతికోసం తీర్థయాత్రలు చేయవలసివస్తుంది.

సామాన్య ఉద్యోగి తనకు నీడలా అంటి పెట్టుకుని సేవలు చేసే అర్ధాంగి అంతరంగాన్ని తెలుసుకోలేకపోవటాన్ని 'అసమర్థుని జీవయాత్ర' లో సమర్థంగా తెలిపారు.

పల్లెటూళ్ళలో ఎన్నికలను ప్రాణాంతకంగా మారటాన్ని శ్రీనాగభైరవ 'ఎలక్షన్‌కి ముందు రాత్రిమాపల్లె మహామైకంలో పడిపోతుంది/ మూడు సింహాల తలల్ని/ముచ్చటగా నెత్తిన పెట్టుకొన్న ముదనష్టపు కాగితాలు/రహస్యం నటిస్తూ చేతుల్లో ప్రవహిస్తాయి. అప్పుడు కర్రకీ, జండాకర్రకీ/ జీవుడికీ, దేవుడికీ తేడాలేదు, అంతా ఒకటే.... ఏ బాంబు ఎక్కడ తలదాచుకుందావాలో/ ఏకత్తి ఏ కుత్తుకలో జన్మసాఫల్యం చేసుకోవాలో/ ఆమేదలే నిర్దేశిస్తాయి" అని వర్ణించి అప్పటి పరిస్థితిని కళ్ళకు కట్టించారు.

ప్రత్తి రైతుల ఆత్మహత్యలకు దారితీసిన పరిస్థితులను "మహారాజు బావురుమన్నాడు"లో హృదయవిదారకంగా వర్ణించారు.

"నాదేశ దరిద్రానికి/ చిహ్నం కాకూడదు నా జెండా/ నాదేశీయుల స్వార్థానికి/ ప్రతీక

కావ్యసంపుటి: కవి; శ్రీ నాగభైరవ కోటీశ్వరరావు; ప్రచురణ: నాగభైరవ ప్రచురణలు. గుళ్ళంపల్లి ప్రకాశంజిల్లా; పిన్: 523211; పేజీలు; 70]

---

కాకూడదు నాపతాక" అన్న సంకల్పంగల నాగభైరవ వాక్కు స్పష్టమైనది. శక్తిమంతమైనది కూడ.

'నగరంలో ఏఅల్లరి చెలరేగినా ప్రజాజీవితం సంక్షోభంలో పడిపోవటాని పతాక శీర్షికలో' నాగభైరవ విపులంగా తెలిపారు.

ఈ సంపుటిలో ఇంకా "మనకేం మనం బాగానే ఉన్నాం; చిన్నప్పటి మాఊరి ఉదయం స్వాతంత్ర్య సమరయోధులు, అమరేంద్ర ఆత్మకి" గీతాలు, సహృదయులు చదివి ఆనందించదగినవి. వైవిధ్యభరితమైన శ్రీనాగభైరవ కావ్యసంపుటి హృదయాహ్లాదకరమైనది.

రామమోహనరాయ్.

# "కన్నెగంటి హనుమంతు"

## (బాలల జాతీయ కథాకావ్యం)

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు ప్రముఖ విద్వత్కవి. పద్యంలో కాని, గేయంలోకాని, వచనంలోకాని పరిపూర్ణమైన భావాన్ని జోడించి సహృదయ హృదయాలను అలరించే నైపుణ్యంకల సాహితీమర్మజ్ఞులు శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు.

'కన్నెగంటి హనుమంతు' జాతీయ కథా కావ్యం. ఆయన బాలల కోసం వ్రాసింది. అయినప్పటికీ పెద్దవాళ్లకు సరిపడే ప్రౌఢత్వం మనకు ఈ కావ్యంలో గోచరిస్తుంది. కవి తాను బాలలను దృష్టిలో ఉంచుకొని రచన చేస్తేనే ఇంత ప్రౌఢంగా ఉంది. మరి పెద్దవాళ్లను దృష్టిలో ఉంచుకొని రచిస్తే ఇంకెంత ప్రౌఢంగా ఆయన రచన ఉంటుందో దీనిని బట్టి మనం ఆయన పాండిత్యాన్ని, ఆయన రచనానైపుణ్యాన్ని అంచనా వేయవచ్చు.

ఈ కావ్యంలో కన్నెగంటి హనుమంతు ఔన్నత్యాన్ని చక్కగా వర్ణించారు శ్రీ నాగభైరవ కావ్యాన్ని తొమ్మిది భాగాలుగా విభజించి కథను రమ్యంగా, పఠితను ఆకర్షించే విధంగా నడిపారు. ఒకచోట పల్లెలను గురించి వర్ణిస్తూ కవి....

"పల్లెలా అవి? పారిజాతసు
మాల జల్లుల కొల్లలే అవి
పల్లెలా అవి? సొగసులను తూ
ర్పారబోసిన కళ్ళములు అవి.''

ఎంత రమణీయంగా, హృదయంగమంగా చెప్పాడీ గేయం. పారిజాత సుమాల జల్లుల కొల్లలే ఈ పల్లెలన్నీ, తూర్పారబోసిన కళ్ళములే ఈ పల్లెలనీ చెప్పడం ఒక్క నాగభైరవకే సాధ్యమవుతుందేమో?

అంతవరకు అంధకారంలో బందీయైన ప్రదేశమంతా కన్నెగంటి హనుమంతు రాకతో మేల్కొన్నది అని చెపుతూ—

'ఊరు మేల్కొనె ఏరు మేల్కొనె
ఏరు కాదది కాన మేల్కొనె
అంబరములో వెలుగు మేల్కొనె
అంతటను చేతనము మేల్కొనె'

అంటాడు. ఊరు మేల్కొనడం, ఏరు మేల్కొనడం, కాన మేల్కొదం, ఆకాశంలో వెలుగు మేల్కొనడం మామూలే. కాని అప్పటి వరకు నిద్రిస్తున్న చేతనం కన్నెగంటి హనుమంతు రాకతో మేల్కొనడం చాలా బాగుంది.

ఇలాంటి కడు రమణీయ గేయ సమూహంతో కూడుకొన్న కమనీయ కథాకావ్యం ఈ 'కన్నెగంటి హనుమంతు'నీతిని, జాతిని, ధైర్యాన్ని, శౌర్యాన్నీ, దేశ భక్తినీ, అను రక్తినీ సమ్మేళనం చేసి పఠితల్ని సమ్మోహితుల్ని చేసే విధంగా ఈ కావ్యాన్ని రూపొందించారు శ్రీనాగభైరవ కోటేశ్వర రావు

నాగభైరవకు గేయం మీద ఉన్న పటుత్వాన్ని, గేయాన్ని ఎంతో నేర్పుగా, వక్రత్వంతో నడిపే తీరునూ, ముఖ్యంగా ఆయనకు మన దేశం మీదున్న భక్తినీ వ్యక్తం చేస్తున్నది.

—తిరునగరి శ్రీనివాస స్వామి

# తేటగీతుల త్రిశతి

'లోకం పోకడను తెలిపే తేట గీతుల త్రిశతి ని శ్రీ ఎస్ కె పిళ్లై రచించారు—వీరి మరణానంతరం వీరి కుమారులు తమ తండ్రిగారి ఈ చిత్రంపుపోకడల్' ప్రచురించారు.

'దండమయ్యా పంతులుగారు దండమంటె
ఖాతతీసి తండ్రిది బాకి కట్టు మనియె'
"తలకు గాంధిజీ టోపీలు తళుకు లొలుక
మెయికి ఖద్దరు దుస్తులు మెరిసిపోగ
మనసు ధ్యానించు మంత్రంబు ధనము
ధనము'

'ఇల్లుకాలింది జంగమా యెట్లనంచే
జోలె సంచని చక్కగా చూపినట్టే
అన్ని వున్నవి దగ్గ అన్నదంట
చంకజోలె ముందురున్న చాలుగదా!'

---

[చిత్రింపు పోకడల్' కావ్యం,
కవి; ఎస్. కె. పిళ్ళై,
ప్రచురణ; జనహిత సాహిత్య సమితి
కాశ్మీరగడ్డ, కరీంనగర్ 505002
పేజీలు. 90
వెల రూ—121)

---

మొదరైన చమత్కారాలున్న పిళ్లైగారి పద్యాలు చదువదగినవి.

రామమోహన రాయ్



# ఆంధ్రప్రదేశ్ నందలి వివిధ జిల్లాలలో జరుగనున్న అమృతోత్సవ మహాసభల సందర్భమున సన్మానింపబడు ప్రచారకుల వివరం

| క్ర, సం. | పేర్లు | గ్రామము /పట్టణము | జిల్లా |
|---|---|---|---|
| 1. | బి కైలాసరావు పట్నాయక్ | చీపురుపల్లి | విజయనగరం జిల్లా |
| 2 | చందక అప్పలకొండమ్మ | రైవాడ | ,, |
| 3 | చందక సత్యనారాయణ | బొబ్బిలి | ,, |
| 4 | వి. వి. రమణమ్మ | విజయనగరం | ,, |
| 5. | వి. మాణిక్యమ్మ | విజయనగరం | ,, |
| 6. | ఎమ్. వేదవల్లి | విశాఖపట్నం | విశాఖపట్టణం |
| 7. | ఎమ్. సీతాలక్ష్మి | ,, | ,, |
| 8 | ఓ.వి,వి, లక్ష్మి | " | ,, |
| 9. | ఎమ్. దుర్గాబాయి. | ,, | ,, |
| 10. | ఎమ్. వి. టి. ఆచారి | ,, | ,, |
| 11. | ఎమ్. శేషాచారి | ,, | ,, |
| 12. | ఎమ్. వి, ఎన్ రమామణి | ,, | ,, |
| 13. | నెల్టూరి లక్ష్మి | ,, | ,, |
| 14. | ఎస్. రమాదేవి | ,, | ,, |
| 15. | ఎమ్. పేరిందేవి తాయారు | ,, | ,, |
| 16. | యన్.రాఘవ | ,, | ,, |
| 17. | ఎన్. భక్తవత్సలం | ,, | ,, |

| క్ర, సం. | పేర్లు | గ్రామము / పట్టణము | జిల్లా |
|---|---|---|---|
| 18 | జె. వి. ఎస్. బాపూజీ | విశాఖపట్టణం | ,, |
| 19. | ఎస్ మాలతి | ,, | ,, |
| 20. | పి. బాలత్రిపురేశ్వరి | ,, | ,, |
| 21. | కే. ప్రభావతి | ,, | ,, |
| 22. | యస్.టి.పి. శ్రీవాణి | ,, | ,, |
| 23. | టి వి. సూర్యకాంతం | ,, | ,, |
| 24. | పి. లక్ష్మి | ,, | ,, |
| 25. | ఆర్. లక్ష్మణమూర్తి | ,, | ,, |
| 26. | కె. రాజ్యలక్ష్మి | కాకినాడ | తూర్పుగోదావరిజిల్లా |
| 27. | యస్.వి. భారతలక్ష్మి | భీమవరం | పశ్చిమగోదావరిజిల్లా |
| 28. | కే. మహాలక్ష్మి | జంగారెడ్డిగూడెం | ,, |
| 29. | టి. శ్యామలాదేవి | తణుకు | ,, |
| 30. | డి. ఎ. పట్టాభిరామమూర్తి | సిదదవోలు | ,, |
| 31. | సి. హెచ్. రుక్మిణీదేవి | ఆకివీడు | ,, |
| 32. | వెల్సా. ఝాన్సీ | ఏలూరు | ,, |
| 33. | జి. సత్యవతి | ,, | ,, |
| 34. | యస్. నాగమణి | ,, | ,, |
| 35. | జి.వి జె.యస్. సీతారామస్వామి | ,, | ,, |
| 36. | కే. కృష్ణారెడ్డి | వట్లూరు | ,, |
| 37 | కంభంపాటి రామలక్ష్మి | భుజబలపట్నం | కృష్ణాజిల్లా |
| 38. | జే. వెంకటేశ్వరరావు | గన్నవరం | ,, |
| 39. | కె. కోటేశ్వరరావు | విజయవాడ | ,, |
| 40. | యమ్. రామలక్ష్మి | ,, | ,, |

| క్ర.సం | పేరు | గ్రామము/పట్టణము | జిల్లా |
|---|---|---|---|
| 41. | కే. కల్యాణి | విజయవాడ | కృష్ణా జిల్లా |
| 42. | ఎ. నాగరాజకుమారి | గుడివాడ | ,, |
| 43. | జి. విష్ణుప్రసాద్ | అవనిగడ్డ | ,, |
| 44. | కే.యస్. ప్రసాదరావు | నందిగామ | ,, |
| 45. | టి.వి.జి.వి. రామమూర్తి | రెడ్డిగూడెం | ,, |
| 46. | టి. విజయలక్ష్మి | విజయవాడ | ,, |
| 47. | సి.హెచ్. లలితాకుమారి | గుంటూరు | గుంటూరు జిల్లా |
| 48. | పి. రాజేశ్వరరావు | పొన్నూరు | ,, |
| 49. | యమ్. సుబ్బరామయ్య | నరసరావుపేట | ,, |
| 50. | వి. యశోధర | గణపవరం | ,, |
| 51. | బి. వెంకటరావు | అద్దంకి | ప్రకాశం జిల్లా |
| 52. | జె.యమ్. అవధాని | నెల్లూరు | నెల్లూరు జిల్లా |
| 53. | ఎ. అనంతశేష గోపాలాచారి | రామసముద్రం | చిత్తూరు జిల్లా |
| 54. | పి. స్వరాజ్యలక్ష్మి | కడప | కడప జిల్లా |
| 55. | వి. పుల్లయ్య | పొత్తపి | ,, |
| 56. | యఫ్.యమ్.యన్. ఖాదర్ | కడప | ,, |
| 57. | కే.వి. రమణయ్య | పొత్తపి | ,, |
| 58. | కె. జయదేవశర్మ | గుత్తి | అనంతపురం జిల్లా |
| 59. | యమ్. కరిబసయ్య | పెద్దవప్పూరు | ,, |
| 60. | కె. నాగేశ్వరరావు | పామిడి | ,, |
| 61. | డి. అలివేలమ్మ | గుంతకల్ | ,, |
| 62. | కే. నరసింహం | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ జిల్లా |
| 63. | శ్రీమతి. ఇజ్జఖాతూన్ | కొండుగల్ | ,, |
| 64. | వి. ప్రకాశం | సారపాక | ,, |

దక్షిణ భారత హిందీ ప్రచార సభ—ఆంధ్ర
హైదరాబాదు -4

# అమృత హిందీ మౌఖిక పరీక్షా కార్యక్రమం

సభ అమృతోత్సవముల సందర్భముగ 'అమృత హిందీ మౌఖిక పరీక్ష' గత ఆగస్టు నుండి ఇప్పటి వరకు ఆరు పర్యాయములు ఆంధ్రప్రదేశ్ అంతటనూ విజయవంతముగా నడుపబడినది. ఈ ప్రణాళిక ననుసరించి ఇంకనూ ఉత్సాహముతో ప్రచారము చేయుటకు ఎక్కువ సంఖ్యలో విద్యార్థులను "అమృత హిందీ మౌఖిక పరీక్ష' నందు కూర్చొనబెట్టే లక్ష్యముతో ఇకముందు అనగా జూలై 94 నుండి ప్రతి నెలాఖరు రోజున ఆయా కేంద్రములలో అమృత హిందీ మౌఖిక పరీక్ష నడుప బడుటకు నిర్ణయించబడినది. ఈ సౌకర్యమును ప్రచారకులందరూ వినియోగించుకొని ఎక్కువ సంఖ్యలో విద్యార్థులను తయారు చేయగలరని మరియు హిందీ ప్రచారోద్యమములో తమతమ సహాయ సహకారము లందించగలరనీ ఆశిస్తున్నాము.

కార్యదర్శి

Edited Printed and Published by A. Sankara Sastry on behalf of the D.B. Hindi-Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad-500 004.